# విపుల జీవనస్రవంతి...!



ఈ 'విపుల' ప్రపంచం ఒక పెద్ద మ్యూజియం వంటిది. దాన్ని దర్శించటం, అధ్యయనం చేయటం, అవగాహన చేసుకుని ఆనందించటం అందరికీ సాధ్యం కాదు. ఎంత ఆసక్తి ఉన్నా ఎవడూ కూడా ఈ విశాల విశ్వాన్ని ఛాయా మాత్రంగానైనా చుట్టిరాలేరు.

కానీ ..అసంభవాలను సుసంభవం చేసే అద్భుత ప్రయోగం విపుల. అనతి కాలంలోనే అశేష పాఠకులను ఆకట్టుకుని తెలుగు మాసపత్రికలలో అగ్రశ్రేణిని అందుకున్న విశిష్ట కథా వేదిక 'విపుల'. వివిధ భారతీయ భాషలలోని, ప్రపంచ భాషలలోని ఉత్తమ కథలకు వేదిక విపుల. జాను తెనుగు అనువాదాలతో అచ్చ తెలుగు కథల్లాగే పాఠకుల్నాకట్టుకుని విశ్వ విహారం చేయించే ఏకైక మాస పత్రిక విపుల

ప్రతి నెలా కనీసం పదిహేను వివిధ భాషల కథలను అందిస్తోంది విపుల తెలుగు, తమిళం, హిందీ, ఉర్దూ, కన్నడం, మలయాళం, సింధీ, కాశ్మీరీ, గుజరాతీ, అస్సామీ, ఒరియా, నేపాలీ, మరాఠీ, జర్మన్, ఫ్రెంచి, రష్యన్...ఒకటేమిటి?...విపుల భాషా పరిధి అనంతం. విపుల ఎన్నిక అనన్యం.

కథలుకాక మరెన్నో కార్టూన్లు, జోకులు, విచిత్రవిశ్వ విజ్ఞానం కూడా అందజేస్తోంది విపుల. రంగుల ఆఫ్ సెట్ ముద్రణలో కనువిందు చేసే చిత్రాలు 'విపుల' మరో ప్రత్యేకత.

విశ్వ కథా విపంచి

**విపుల**

*132 పేజీలు రెండు రూపాయలే*

# జీవితంలో ఎప్పటికీ మరువలేని కొన్ని మధుర స్మృతులు...

మామూలు 'మూస' నవలల్లాగానే, తను కూడ కేవలం పరితల్ని కాసేపు 'స్వప్న ప్రపంచం'లో విహరింప జేయటానికి రావి శ్రీమన్నారాయణ 10 సం. ఆగాలా? "యువరాజు" కాలక్షేపపు నవలకాదు. జీవితానికి, మానవ మనస్తత్వానికి సంబంధించి ఎంతో నిర్భయంగా, నిస్సంకోచంగా "యువరాజు"లో చిత్రించబడిన చేదు నిజాలు మిమ్మల్ని ఆశ్చర్యపరుస్తాయి. మీ మనసులో ప్రగాఢముద్ర వేస్తాయి. 'ఇలాటి నవల ఇంతకుముందెప్పుడైనా చదివానా?' అని మీరు తప్పక ఆలోచించేటట్లు చేస్తుంది "యువరాజు". జీవితాంతం మీకు జ్ఞాపకముండే ఎన్నో మధుర స్మృతులు మీకు "యువరాజు"లో కానుకగా లభిస్తాయి. "యువరాజు"ను మీరు చదవటమే కాదు...మానవ పురోగమనానికి బలమైన వ్యక్తిత్వం, క్రమశిక్షణ, కార్యదీక్ష, శీలం, నిజాయితీ ఎంత ఆవశ్యకమో చెప్పేందుకోసం "యువరాజు"ను మీ పిల్లలందరితోకూడ చదివిస్తారు...

అట్ట వెనుక
బాపు గీసిన
5 రంగుల చిత్రం

"యువరాజు"లో శిఖరిం మనస్తత్వ సమీక్ష" అనే అంశంపై ఏర్పరచిన పోటీకి నిర్ణయించిన నగదు బహుమతుల మొత్తం విలువ

రు. 5,000

మొదటి బహుమతి : రు. 1000/- ......... రెండవ బహుమతి - రు. 700/-
మూడవ బహుమతి : రు. 500/- ......... నాలుగవ బహుమతి - రు. 300/-
ఇంకా ఒక్కొక్కటి రు. 50/- చొప్పున 50 ప్రత్యేక బహుమతులుంటాయి

గంగాధర్ గీసిన
అపురూపమైన
4 ఫాయిల్స్
ముఖ చిత్రం




బహుమతి నిర్ణేతలు : రిటైర్డ్ హైకోర్టు ఛీఫ్ జస్టిస్, ప్రస్తుతం ఆంధ్రాయూనివర్శిటీ వైస్-ఛాన్సలర్ అయిన శ్రీ ఆవుల సాంబశివరావు గారి అధ్యక్షతలో ఒక ఉన్నత విద్యావంతుల, సాహితీవేత్తల కమిటీ పై బహుమతులు నిర్ణయిస్తుంది. పూర్తి వివరాలు, వ్యాస రచన పోటీ కూపన్— "యువరాజు" నవలలో వున్నాయి.







1970 తరువాత రావి శ్రీమన్నారాయణ తొలి తెలుగు రచన
1985 లోగా — కచ్చితంగా — కడపటి తెలుగు రచన కూడా!

★★★ "యువరాజు" (సాంఘిక నవల) అసలు మూల్యము రు. 40/-.
అయితే PRIVILEGE PRICEగా 1981 ఏప్రిల్ 30 వరకు రు. 30/-లకే (By M.O./I.P.O./B.D.) రిజిస్టర్డ్ పోస్టులో పంపబడుతుంది. లేదా ముందు రు. 20/- M.O. చేస్తే, మిగతా రు. 10/-లకు V.P.గా పంపిస్తాము.

## VARALAKSHMI PUBLICATIONS,
11-2nd St., Dr. B. N. Reddy Road, T. Nagar, MADRAS-600017.

రావి శ్రీమన్నారాయణ, M.A., నిజమైన మాస్టర్ పీస్- "యువరాజు"

# యద్దనపూడి సులోచనారాణి

సైకో రొమాంటిక్ సస్పెన్స్ థ్రిల్లర్

## జాహ్నవి

వెల 12 రూ.

క్రౌన్ సీరీస్

6-4-'81 విడుదల!

విడుదలకు ముందే ఆర్డరిస్తే 11 రూ.లకే!




ఆద్యంతం ఉత్కంఠతతో చదివించి, మీరు ఊహించని ఎన్నెన్నో మలుపులతో గంగాప్రవాహంలా సాగిపోయే నవలారాజం! శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి సైకో రొమాంటిక్ సస్పెన్స్ థ్రిల్లర్ "జాహ్నవి" కోసం మీ ఆర్డర్ నేడే మీ దగ్గర్లో వున్న బుక్ సెల్లర్ వద్దగాని, న్యూస్ ఏజంట్ వద్దగాని బుక్ చేసుకోండి. 6-4-'81 లోపు బుక్ చేసుకుంటే రూ 11 లకే! పోస్టులో తెప్పించు కోవాలంటే క్రింది చిరునామాకి రూ 10 లు ఎమ్ ఓ చేయండి. ఒక రూపాయికి వి.పి. పెట్టి, 6-4-'81 అందేలాగా పంపుతాము

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతిరోడ్ సికింద్రాబాద్-3



**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 13-3-'81
రౌద్రి సం॥ ఫాల్గుణ శు॥ అష్టమి
**సంపుటము 74 : సంచిక 2**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి అంజలీనాయుడు
(ఫోటో : ఎ. రవిచందర్)

**కథలు :**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# డెట్ బిళ్ల వాడండి, తెలుపును పొందండి

ఇపుడు ముందుకంటే
ఎంతో ఎక్కువ మంది
డెట్ బిళ్ల యొక్క
ఉజ్వలమైన ఉతుకును
ఇష్టపడుతున్నారు:
వారంటారు,
ఇది మిరమిట్ల తెలుపును
ఎంతో ఎక్కువగా
పొదుపును ఇస్తుంది.




# డెట్ బిళ్ల

Shilpi DM-41 A/80 Tel

# ఇప్పుడు ప్రవేశపెడుతున్నాం కొత్త మర్ఫీ మనోహర్!

MEDIUM WAVE MTRS 500 400 200 MW METRES
SHORT WAVE 2 MTRS 90 75 49 41 SW 2 METRES MEGAHERTZ
SHORT WAVE 1 MTRS 31 25 16 13 SW 1 METRES MEGAHERTZ
TUNING
murphy manohar
ON OFF

## మీకు సంగీతంమీద మక్కువవుంటే దీని లక్షణాల్ని మీరు మెచ్చుకోక మానరు!



మనోహర్ — హోదాగల
3 బ్యాండ్ల ట్రాన్సిస్టర్

**మర్ఫీ**

*మీకు నిరంతరం తోడుగా*



ఎందుకమ్మా, ఆవిడ నిన్నెందుకు కోప్పడింది?' సందేహంగా అడిగాడు.

వాళ్ళింటికెళ్ళి అల్లరి చేసిందా – అట్లా చేసే పిల్ల కాదే?

"ఏమో నాన్నా – నేనేం చెయ్యలేదు" అంటూ జరిగిన విషయం చెప్పింది తనన్న మాట చెప్పింది

ఉలిక్కిపడ్డాడు

"ఛ-పోర్కమ్మాయ్ .." నోటివెంటకూ వచ్చిన మాటని అనకుండ, తమాయించుకున్నాడు అతికష్టంమీద

చటుక్కున చరణ్ ముఖం ఎర్రబడింది.

చెప్పవల్సింది చెప్పి మౌనంగా వుండిపోయింది శ్రుతి, అదే ఆలోచిస్తూ.

చరణ్ కూడా కాసేపు ఏమీ మాట్లాడలేకపోయాడు

ఆ తరువాత అన్నాడు – "అట్లా అనగూడదమ్మా! తప్పు చాలాతప్పు."

తండ్రి తనని సమర్థిస్తాడనుకున్న శ్రుతి నిరాశ చెందింది ఈ మాటలతో

"రేపు వెళ్ళి ఆవిడకి 'సారీ' చెప్పేస్తావా? చెప్పాలి తల్లీ !" అన్నాడు పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ.

తల వూపింది శ్రుతి

మరి కాసేపటికి నిద్రపోయింది

* * *

(గత సంచిక తరువాయి)

ప్రొద్దున లేవంగానే పాలయినా తాగకుండా పరుగెత్తింది గీతిక దగ్గిరికి శ్రుతి గీతిక ఇంట్లో అందరికీ కాఫీలు, పాలు, బోర్నవిటాలు అందిస్తోంది

లోపలికి పరుగెత్తుతున్న శ్రుతిని చూస్తూ, రత్నమ్మ "ఏమిటే పిల్లా! ఏమిటి? ఏమిటా పరుగు? ఎక్కడికి?" అంది వారిస్తూ.

అది వినిపించుకోకుండానే లోపలికి వెళ్ళింది శ్రుతి.

శ్రుతిని చూడంగానే గీతిక ఎప్పట్లానే నవ్వుతూ "రా శ్రుతీ! పాలు తాగుతావా ?" అడిగింది ఆప్యాయంగా.

ఆంటీ తనతో ఎప్పట్లాగా మాట్లాడడం చూసి శ్రుతికి చాలా సంతోషం కలిగింది.

"పొద్దుగానే ఆంటీ – మీకు సారీ చెప్పాలని వచ్చాను" అంటూ గీతిక పక్కన కూర్చుని "సారీ ఆంటీ! నేనన్నమాట చాలా తప్పు నాన్న గూడా చెప్పారు – అది చాలా తప్పట" అంది శ్రుతి

"మీరేమన్నా అనుకున్నారా! నేను చాలా చెడ్డ పిల్లనని అనుకున్నారు కదూ ?" ఇంకా ఏదో అంటోంది శ్రుతి పిల్లలంతా చుట్టూ వున్నారు - అందరూ ఈ మాటలు వింటున్నారు గీతికకి అది చాలా అవమానంగా తోచింది ఎప్పుడో ఆ విషయం తను ఒక్క మాటన్నా ఏమిటే అని అంతా అడుగుతారు తెలిస్తే అదింకా అవమానం అందుకే ఏం మాట్లాడకుండా

"నేను స్నానం చేసి వస్తాను" అని వెళ్ళిపోయింది

## సీరియల్

# రాగలహరి

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

"ఏంఫరవాలేదమ్మా, మర్చిపో జరిగింది" అని గీతిక అంటుందేమోనని ఆశగా ఎదురు చూస్తున్న శృతి బిక్కముఖం వేసుకుని బయటి కెళ్లి పోయింది.

బాత్‌రూమ్‌లో కెళ్ళిన్న గీతిక 'ఛీ - ఛీ –' అనుకుంది జరిగింది తల్చుకుని !

## 27

గీతిక కుట్టుపనిలో కోర్సు పూర్తి చేసింది. మెల్లి మెల్లిగా చుట్టుపక్కల వాళ్ల గుడ్డలు కుట్టడం మొదలు పెట్టింది. వాళ్లు ఏదీ పరికా ఇస్తే తీసుకోవడానికి మొహమాట పడింది మొదట. క్రమక్రమంగా అలవాటయింది. గౌన్లు చక్కగా, ఫాషన్‌గా కుట్టడం, మగవాళ్ల బట్టలుగూడా నీట్‌గా కుట్టడం నేర్చుకుంది. ఎంతిస్తే అంతే తీసుకోవడంతో గుడ్డలు కుట్టడానికి ఇచ్చే వాళ్లు ఎక్కువయ్యారు. ఎవరో చెప్పడంతో రెడీమేడ్ షాపుకికూడా గౌన్లు, చిన్నపిల్లల డ్రస్సులూ కుట్టివ్వడం ప్రారంభించింది. ఆ షాపువాళ్లు రకరకాల డిజైనుల పుస్తకాలు ఇచ్చి వాటి ప్రకారం కుట్టి ఇవ్వమనేవారు.

ఆ విధంగా డబ్బు బాగానే ముడుతోంది గీతికకి. తన కాళ్ల మీద తాను నిలబడగలననే ధైర్యం వచ్చింది. ఏడోతరగతి, పదోతరగతీ కూడా పాసయితే, ఏ స్కూల్లో నైనా కుట్టు టీచరుగా ఉద్యోగం రావచ్చునని సూచించారు కొందరు గీతికతో. ఆ ఆలోచనలో వుంది గీతిక.

అంతలో చంద్రిక తనకు వంట్లో బాగుండడం లేదనీ, తల్లిని వెంటనే రమ్మనీ ఉత్తరం రాసింది. రత్తమ్మ హడావిడికి అంతులేదు వెంటనే ప్రయాణమయింది. పిల్లలందర్నీ గీతికి మీద వదిలేసి వెళ్ళింది. వెళ్ళిన రెండు మూడు రోజులకల్లా భర్తనీ రమ్మని టెలిగ్రాం ఇచ్చింది. ఆయనా వెళ్ళాడు.

అసలు చంద్రికకి ఏం ప్రమాదం ముంచుకు వచ్చిందో ననుకుంది గీతిక ఆ తరువాత తండ్రి రాసిన ఉత్తరంలో సంగతి తెలిసింది.

"చంద్రికకి నెల తప్పిందనీ, విపరీతమైన వేవిళ్లతో చిక్కి శల్యమయిందనీ, కొన్నాళ్ళు తమతో పంపించమంటే– సంజయ్ ఒప్పుకోవడం లేదనీ, అందుకని అతడికి నచ్చచెప్పి చంద్రికని తీసుకు రావడానికి కొంత టైము పడుతుం"దని రాశాడు ఆయన.

కానీ అప్పట్నుగా సంజయ్‌కి నచ్చచెప్పలేక పోయారేమో– ఆయన వచ్చేశాడు రత్తమ్మ అక్కడే వుండిపోయింది. నెలలు నిండాక పురుడు పోసి కానీ తను రానంది.

ఉన్నన్ని రోజులూ రత్తమ్మ రాసే ఉత్తరాల్లో ముఖ్యాంశం సంజయ్‌ని తిట్టడమే. చంద్రికని నానా బాధలూ పెడుతున్నాడనీ, తను కూడా లేకపోతే దాన్ని చంపేస్తాడు కూడాననీ – అందుకే తనిక్కడ వుండిపోతున్నాననీ రాసింది.

"సంజయ్ అలా ఎందుకుమారిపోయాడా" అనిక్షణం ఆలోచించిన గీతిక, తన కెందుకులే ఆ సంగతి అని ఆ ఆలోచనని పక్కకి నెట్టేసింది ! డబ్బు రత్తమ్మకి పంపించడానికీ, ఇంట్లో వాడడానికీ మంచినీళ్లలాగా ఖర్చయిపోతోంది గీతిక సంపాదించిందీ, ఆమె తండ్రి సంపాదించింది కూడా చాలడం లేదు. అతికష్టం మీద రోజులు ఈడ్చుకొస్తున్నారు ప్రస్తుతానికి చదువుని వాయిదా వేసింది గీతిక. తన కొచ్చిన కత్తిరింపులూ, కుట్లూ చుట్టుపక్కల కొంతమంది పిల్లలకి నేర్పడం ప్రారంభించింది. కానీ, జీవితమంటేనే నిరుత్సాహం కలుగుతోంది ఆమెకి ఒకే రకమైన జీవితం విసుగుని కలిగిస్తోంది !

* * *

బలహీనంగా ఉన్న చంద్రికకి నెలలు నిండకుండానే పురుడు వచ్చింది. కవలలు ! కాన్పు చాలా కష్టమయింది రత్తమ్మ చాలా కంగారు పడిపోయింది. కవలల్లో ఒక బిడ్డ పోయి– ఒక బిడ్డ బతికాడు అదే చాలు అనుకున్నారు

కానీ, కవలలో ఒకరు బతికితే కూడా నమ్మకం లేదనీ, బతికితే ఇద్దరూ బతకాలనీ అన్నారు కొందరు. చాలా ఆందోళన చెందింది రత్తమ్మ ఏమూలో రత్తమ్మకి తను చేసిన అన్యాయానికి ఇది ప్రతిఫలమేమో అని అనిపించింది! పశ్చాత్తాపం లాంటిది ఓలగ సాగింది. తిరిగి వెళ్ళంగానే ఎట్లాగయినా గీతికకి పెళ్ళి చెయ్యాలని నిశ్చయించుకుంది ఆవిడ !

పది పదిహేను రోజులు అనుమానంగా చెప్పారు– ఆ తరువాత పిల్లవాడికి కింకేం భయం లేదన్నారు డాక్టర్లు ! చంద్రిక ఇంటికి తిరిగి వచ్చింది- హాస్పిటల్ నుంచి!

* * *

చంద్రిక కొడుకు బారసాల ఒక పెళ్ళిలాగానే చెయ్యడానికి సంరంభాలు సిద్ధం చేసింది రత్తమ్మ మొగుణ్ణి - పిల్లలనీ రమ్మని ఉత్తరం రాసింది గీతికనీ రమ్మని రాసిందిగానీ, గీతిక వెళ్ళడానికి ఇష్టపడలేదు. తండ్రినీ, తమ్ముళ్లనీ పంపించింది.

తను వుండిపోతానని చెప్పినప్పుడు – తండ్రి, "ఒక్కదానివీ ఎట్లా వుంటావమ్మా!" అనడిగాడు.

"పని మనిషి వుందిగా శృతిని తోడు పడుకోబెట్టుకుంటాను అంతగా అయితే" అంది గీతిక

వీలున్నంత తొందర్లో వచ్చేస్తానని చెప్పి పిల్లలతో వెళ్లాడు తండ్రి. బారసాల కవసర

**జరిగినకథ-13 :** ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు పుట్టిన పాపకు 'శృతి' అని పేరు పెట్టుకొంటారు. పల్లవి మళ్ళీ గర్భవతి అవుతుంది. పాపను కన్న పల్లవి ప్రాణం పోవడంతో చరణ్ పిచ్చివాడవుతాడు. పల్లవి మరణానికి కృతే కారణంగా భావించిన చరణ్, ఆపాప ప్రసక్తి వస్తేనే మండిపడుతుంటాడు. శృతి తన పనులు తాను చేసుకోవటమే గాక పాప పనులన్నీ తనే చేస్తుంటుంది తమ ఎదురింట్లోకి క్రొత్తగా వచ్చిన గీతికతో పరిచయం పెంచుకొంటుంది శృతి. గీతికను ఆమె సవతితల్లి చాలా హీనంగా చూస్తుంటుంది గీతిక మేనమామ సంజయ్‌తో ఆమె సంసార జీవితానికి పనికిరాదని లేనిపోని అభాండాలు చెప్పి తనకూతురు చంద్రిక సంజయ్‌ల వివాహానికి ముహూర్తం పెట్టిస్తుంది రత్తమ్మ ఏదో ఓ సంబంధం చూసి గీతికకి ముడిపెట్టాలని చూస్తున్న రత్తమ్మ ఓనాడు వేదాంతంగారితో గీతికని చరణ్ కిద్దామని చెప్పగా, మండిపడతాడాయన. తన మామయ్యను తనకు కాకుండా చేసింది రత్తమ్మేనని తెలుసుకున్న గీతిక ఆమెను నిలదీసి అడుగగా, గీతికను కొట్టి, గదిలో బంధించుతుంది. జిడ్డు కృష్ణమూర్తి ప్రసంగాల ప్రభావంతో చరణ్ పూర్తిగా మారిపోతాడు. సంజయ్, చంద్రికల పెళ్ళి జరిగిపోతుంది గీతిక టైలరింగ్ స్కూల్లో చేరి కుట్టు, కటింగ్‌లూ శ్రద్ధగా నేర్చుకొంటుంటుంది

మ్మైనవన్నీ తనే చేసి క్కడ్కి చే పంపించింది గీతిక తను లేకపోతే రత్నమ్మ నిభాయించుకో లేదని తెలుసు గీతికకి అయినా సంజయ్ ఇంటికి తనెట్లా వెళ్ళగలదు? అనుకుంది. వెళ్ళలేకపోయింది వెళ్ళిన తండ్రీ, పిల్లలూ వారం అయ్యాకగానీ రాలేదు. ఆ వారంలో అనుకోని సంఘటనలు జరిగాయి గీతిక జీవితంలో!

## 28

శృతి గీతిక దగ్గిర పడుకోడానికి సంబర పడింది చరణ్ కూడా అందుకేమీ అభ్యంతరం పెట్టలేదు కథలు కబుర్లు చెబుతూ పడుకునేది గీతిక శృతి దగ్గిర. శృతి ఎదురింటికి వెళ్ళడం చూసిన శృతి తనతో వెళ్తానని మారాం చేసింది. అందుకని రోజూ శృతి నిద్రపోయేదాకా వుండి అప్పుడు వెళ్ళేంది శృతి గీతిక దగ్గిరకి

పిల్లల దగ్గిర పడుకోవటం అలవాటయిన చరణ్ కి శృతి లేకపోతే ఏమి తోచడంలేదు కూడాను!

శృతికి గీతిక దగ్గిర పడుకున్నప్పుడు లీలగా తల్లి తన దగ్గిర పడుకున్న రోజులు గుర్తు కొస్తున్నాయి! మూడు రోజులు గడిచాయి. నాలుగో రోజున శృతి స్కూలునించి ఇంటికి వస్తూ వర్షంలో బాగా తడిసింది జ్వరం వచ్చింది ఆ రాత్రికే. ఆ రాత్రికి ఇంట్లోనే పడుకోమన్నాడు చరణ్ వినలేదు శృతి జ్వరం వచ్చినా గీతిక దగ్గిరే పడుకుంటానని మొండికేసింది చరణ్ ఎంతో నచ్చచెప్పాడు. కానీ వినలేదు పరుగెత్తుకుంటూ ఎదురింట్లోకి వెళ్ళిపోయింది, వారిస్తున్నా

# రాగలహరి

వినకుండా. ఏంచెయ్యాలో తోచని చరణ్, శృతిని తీసుకువద్దామని తనూ ఆ వెనకే వెళ్ళాడు

అనుకోని అతడి రాక గీతికకి ఆశ్చర్యం కలిగించింది. తొట్రుపడింది లేచి నిలుచుంది లోపలికి రమ్మనాలని కూడా తోచలేదు. చరణ్ మొదట 'నమస్కారమండీ' అన్నాడు. ప్రతి నమస్కారం చేసింది.

ఒకక్షణం అయ్యాక తనని తాను సంభాళించుకున్న గీతిక "ఏం శృతీ! ఎందుకూ వున్నావు?" అంటూ తలమీద చెయ్యేసి నిమురుతూ దగ్గిరకి తీసుకుంది మొహం వాడిపోయి వుంది శృతికి వళ్ళు వేడిగా తగిలింది గీతిక చేతికి

"ఏమిటే, జ్వరం వచ్చిందా?" కంగారు పడుతూ నుదురు పట్టుకు చూసింది

"ఊఁ!" అంది శృతి గీతికని పట్టుకుని

చరణ్ అందుకున్నాడు "అవునండీ! జ్వరంగా వుంది ఇంట్లోనే పడుకోమంటే వినటం లేదు. మీరు కాస్త చెప్పి వప్పించండి జ్వరంతో పిల్ల మీ దగ్గిర పడుకుంటే మీకూ ఇబ్బందే కదా?" అని

"రామ్మా శృతీ! రేపు పడుకుందువు గాని ఇక్కడ!" అన్నాడు.

"నేను రాను. ఇక్కడే పడుకుంటాను. ఆంటీ వస్తే నేనూ వస్తాను" అంది శృతి గీతికకి మరీ అంటుకుపోతూ

ఈ మాటలకి గీతిక అపార్థం చేసుకుంటుందేమోనని భయపడ్డాడు చరణ్.

"పరవాలేదు! పడుకోనివ్వండి, నాకు అలాగే మా తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ జ్వరం వస్తే నన్నొదలరు!" అంది గీతిక నవ్వుతూ.

"మా యింట్లో జ్వరానికి మందుంది. ఈపూటకది ఇస్తాను రేపు డాక్టరు దగ్గిరికి తీసుకెళ్ళచ్చు, అంతగా తగ్గకపోతే" అంది తనే మళ్ళీ

"థాంక్సండీ! మీకు శ్రమ కల్గిస్తున్నాను. నేనింక వెళ్తాను" అన్నాడు

"పరవాలేదు నాకేం శ్రమ లేదు. కూచోండి, కాస్త కాఫీ" అంది గీతిక

'ఇప్పుడేంవద్దండీ' అంటూ కూచున్నాడు చరణ్

తండ్రి, ఆంటీ మాట్లాడుకోవడం శృతికి ఆనందాన్ని కలిగించింది

చరణ్ కూచున్నాక గీతిక కూడా శృతిని ఒళ్ళో కూచోబెట్టుకుని అతడి ఎదురుగా వున్న కుర్చీలో కూచుంది గీతికని ఇంటి విషయాలు కొన్ని అడిగాడు చరణ్, అంతకంటే ఆమెతో ఏం మాట్లాడాలో తోచక ఆడవాళ్ళతో మాట్లాడడం పెద్దగా అలవాటు లేదు అతడికి గీతిక కూడా అడిగిన వాటికి జవాబులు ఇచ్చింది. భార్య చనిపోవడం, కొన్నాళ్ళు అతడు పరధ్యానంగా గడపడం, ఇప్పుడు మళ్ళీ మామూలు మనిషిగా పిల్లల్ని చూసుకోవడం అన్నీ విని వుంది గీతిక. అతడంటే జాలీ, సానుభూతీ కలిగాయి. 'మనిషి మంచివాడే' అనుకుంది

"మీరు ఒక్కరే వుండడం కష్టంగా లేదూ? వాళ్ళెప్పుడొస్తారు?" అడిగాడు చరణ్

"వచ్చేస్తారండీ అసలీపాటికే రావాలి నాకు అలవాటే అప్పుడప్పుడిలా ఇలా వుండడం. అసలు నాకు ఒంటరిగా వుండాలంటేనే ఇష్టం నేను నలుగురిలో కలవలేను" అంది తల వంచుకుని గీతిక

"అదేం?" అడిగాడు

"ఏమిటో! అమ్మ పోయినప్పటినించీ అదే అలవాటయిపోయింది. పది మందిలో వున్నా నేను ఒంటరిదాన్నే!"

అంతకంటే ఆమె ఏమీ మనసు విప్పి చెప్పకపోయినా - ఆ ఇంట్లో ఆమె పరిస్థితీ, ఆమె తండ్రి పద్ధతీ, సవతితల్లి తీరూ అన్నీ తెలిసివున్న చరణ్ కి ఆమె అంటే జాలీ సానుభూతి లాంటివి కలగసాగాయి.



డాక్టరుగారూ! మా బొమ్మ
పాపాయికి వంట్లో
బాగాలేదు. కొంచెం చెక్ చేసి
చెప్పండి సార్.

జ్వరంలాంటిదేంకాదు.
కడుపులోనే ట్రబుల్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్
ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం
కదా డాక్టర్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్
వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా. వర్షాకాలమైనా
చలికాలమైనా, ఏ కాలమైనా సరే.
పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్
వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి.






**100 ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది**

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS/OPPL/3/80/TEL

## రా గ ల హ రి

"ఈ వంటరితనం పోగొట్టుకోవడానికి మార్గం చెప్తమంటారా?" అడిగాడు చరణ్.

"ఇన్నాళ్ళనించీ ఎదురెదురిళ్ళల్లోనే వుంటున్నాం— అప్పుడప్పుడూ ఒకరి కొకరు తటస్థపడుతున్నాం— వాళ్ళిద్దరూ ఎప్పుడూ మాట్లాడుకోలేదు కానీ— ఇవాళ తనేమిటి— ఇట్లా మాట్లాడుతున్నాడు?" అని తనే ఆశ్చర్యపోయాడు చరణ్

గీతిక ఆశ్చర్యంగా చూసింది.

"జిడ్డు కృష్ణమూర్తిగారి పేరు విన్నారా మీరు ?"

"లేదు !"

"ఆయన మహా జ్ఞాని, తత్వవేత్త. ఆయన ఏటేటా కొన్ని ప్రదేశాల్లో ఉపన్యాసాలిస్తారు. జన్మతః తెలుగువారే కానీ, ఉపన్యాసాలు ఇంగ్లీషులో ఇస్తారు వారి ఉపన్యాసాలు, వారు వ్రాసిన పుస్తకాలు కొన్ని తెలుగులోనూ అనువదించబడాయి నేనూ ఆయన గురించి విన్నాను కానీ, ఆయన ఉపన్యాసం మొన్ననే వినడం జరిగింది. అది అమూల్య, అపూరూప అవకాశం. నిజంగా వారి ఉపన్యాసం వినితీరాల్సిందే! వారి పుస్తకాలు కొన్ని నాదగ్గిర వున్నాయి. మీకు కావాలంటే అవి ఇస్తాను.చదివి చూడండి. మీరు ఒక్కసారిచదివారంటే వాటినివదలలేరు. మీ చికాకులన్నీ మాయమై మనసు నిర్మల మవుతుంది" ఆగాడు చరణ్.

"నా స్వానుభవంతో చెబుతున్నాను. నా భార్యపోయిన కొత్తల్లో నేను వంటరితనంలో అంధకారంలో చాలాకాలం కొట్టుమిట్టాడాను క్రమక్రమాన కాస్త మామూలుగా మారినా— నాలో చికాకులు పూర్తిగా దూరమవలేదు. నేను ఒకసారి మద్రాస్ వెళ్ళినప్పుడు నా ఫ్రెండ్ నన్ను కృష్ణాజీ టాక్స్‌కి తీసి కెళ్ళడం, నాకు ఎంతో మేలు చేసింది. నా మనసుకి శాంతి లభించింది. అప్పట్నించీ వారి పుస్తకాలు చదువుతున్నాను. నిజంగా జీవితంలో మనం తెలుసుకోవల్సినవి చాలా వున్నాయి— అనిపిస్తుంది."

తనను తాను మర్చిపోయి, చరణ్ చెబుతుంటే కుతూహలంగా విన్నది గీతిక.

"మీరంతగా చెబుతుంటే నాకూ ఆ పుస్తకాలు చదవాలనిపిస్తోంది తెలుగు అనువాదాలు పంపిస్తారా? ఇంగ్లీషువి అంత తొందరగా చదవలేను నేను" అడిగింది గీతిక.

"రేపే పంపిస్తాను. లేదు నేనే తెచ్చి ఇస్తాను" లేచాడు చరణ్

శ్రుతి గీతికనలో అప్పటికే వెళ్ళిపోయింది.

* * *

అన్నట్టే ఆ మర్నాడు పుస్తకాలు తెచ్చి ఇచ్చాడు చరణ్. ఆ పుస్తకాలను ఎంతో శ్రద్ధగా చదివింది గీతిక. అవి ఆమె కెంతో నచ్చాయి ఆమెలో ఎన్నో సందేహాలు రేకెత్తాయి. వాటిలో సందేహాలను చరణ్‌తో చర్చించడం మొదలు పెట్టింది గీతిక. అవి చదువుతున్నకొద్దీ ఆమెలో ఆత్మ విమర్శ ఎక్కువగా జరుగసాగింది. ఒకసారి చూచాయిగా తన ఆందోళనను వెలిబుచ్చింది చరణ్‌తో గీతిక

"మీకు తెలుసు ... సెంటర్లు కానీ, ... వుంటే





తల వెంట్రుకలు రాలుటకు ముఖ్య కారణము పేలు

పేలను, ఈరులను నశింపజేయుటకు కెంజ్ వాడండి. సువాసనతోకూడిన పేలనాశిని కెంజ్ హెయిర్ ఆయిల్‌ను వాడి మీ కేశములను కాపాడుకొనండి.

కెంజ్

పేలనాశిని మందు

దీనిలో ఈరులను నశింపజేయు బెన్‌జోకెయిన్ ఉన్నది

నిర్భయముగా వాడుటకు వీలైనది

PHARM PRODUCTS

ఫార్మ ప్రోడక్ట్స్ ప్రయివేట్ లిమిటెడ్

మెడికల్ కాలేజ్ రోడ్,

తంజావూరు-613 007 తమిళనాడు

వ్యాపార వివరములకు వ్రాయుండి.


"ఓహ్, ఏమా అందం!"
మిమ్మల్ని చూసి అందరూ మెచ్చుకునేందుకు
మధురా బట్టలు.
పాలియెస్టర్ మిశ్రిత మధురా బట్టల విస్తృత శ్రేణిలోని
ప్రతి అంశం అందం చిందించేదే. ఆ రంగులు,
ప్రింట్లు, ఆ డిజైన్లు, ఆ నాణ్యత, ఆ ధర...ఓహ్!
మధురా బట్టలు
మధురా కోట్స్ ఉత్పాదన

దేహపుష్టికి ఆరోగ్యానికి
పండిత డి. గోపాలాచార్యులవారి
జీవామృతం
1898 నుండి ప్రసిద్ధి గాంచినది
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు 17



డా॥ పి. వి. కె. రావ్ B A
వైద్యవిద్వాన్, వైద్యాచార్య, సెక్స్ స్పెషలిస్ట్
వివాహము వాయిదా వేయ నవసరం లేదు. హస్త ప్రయోగం, నరముల బలహీనత, శీఘ్ర స్ఖలనములకు ఆయుర్వేద చికిత్స.
పోస్టు ద్వారా చికిత్స కలదు
రావూస్ క్లినిక్,
టి. బి. రోడ్, తెనాలి,
ఫోన్ : 700 - 1010



అపురూపమైన అంబడిపూడి పుస్తకాలు
మీ జీవితాన్ని ఆనందమయం చేసుకోండి.
శక్తి సాధించండి.

| | |
|---|---|
| సినిమాలో నటించడమెలా ? రూ | 5-00 |
| [డ్రామా, రేడియో, టెలివిజన్ నటించడమెలా?] | |
| హిప్నాటిజం (అద్భుతశక్తుల సాధన) | 4-00 |
| సంకల్ప బలం (మానసికశక్తుల సాధన) | 5-00 |
| మీరూ-మీ శక్తి | 10-00 |
| ఆడది కోరేదేమిటి ? | 4-00 |
| స్త్రీల నాకర్షించడమెలా ? | 3-00 |
| గర్భమూ-గర్భనిరోధం (40 చిత్రాలతో) | 5-00 |
| ఉద్రేక స్థానాలు-తృప్తికి మార్గాలు | 5-00 |
| వాత్స్యాయన కామశాస్త్రం | 5-00 |
| వ్యాపారాభివృద్ధికి ఏమి చేయాలి | 10-00 |
| హిందీ, అరవం, ఇంగ్లీషు సెట్లు | 15-00 |
| కరాటే సెట్టు (10 పుస్తకాలు) | 30-00 |

డబ్బుముందుగా పంపితే రిజిష్టర్డు పోస్టులో పంపుతాము. V.P పద్ధతి లేదు.
జలజ ప్రచురణలు, విజయవాడ-3


Eswar

# రాగలహరి

చెప్పండి నాకు వాటిల్లో చేరాలని వుంది. నాకు చేతనైనంత సేవ చెయ్యాలని వుంది" అంది అప్రయత్నంగా.

ఆశ్చర్యపోయాడు చరణ్. "అదేమిటి? అవి మీకెందుకు? మీకు ఇల్లు, తండ్రి అన్నీ వుండగా- అందరూ వుండగా—"

"ఉన్నారు- పేరుకి నాకు అందరూ వున్నారు అందరి స్వార్థానికీ నేను వున్నాను. నిజానికి- అందరికీ వాళ్ళ వాళ్ళ పనులు సవ్యంగా జరిగిపోతే... నేను లేకపోయినా ఫర్వాలేదు—" కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆమె కన్నీళ్ళకి చలించాడు చరణ్ "మీరు దేనికో చాల బాధపడుతున్నారు" అన్నాడు.

"మీరు పరాయి వారే అయినా, మనిద్దరి పరిచయం రెండు రోజులే అయినా, నా బాధని మీరెంత త్వరగా గుర్తించారు!" అనకుండా వుండలేక పోయింది గీతిక

"నా మనసులోని బాధ మీకు చెప్పుకోవాలనిపిస్తోంది నాకు. ఇంతవరకూ నా బాధ విని అర్థం చేసుకునేవారే లేకపోయారు" అంది కన్నీళ్ళద్దుకుంటూ

"మీ కభ్యంతరం లేకపోతే, మీ బాధేమిటో నాకు చెప్పండి అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తాను" అన్న చరణ్ మాటలకి సమాధానంగా తన కధనం అంతా సవివరంగా వినిపించింది గీతిక

ఆమె చెప్పినది విని కదిలిపోయాడు చరణ్ "ప్రపంచంలో ఇట్లాంటివారు కూడా వున్నారా?" అన్నాడు ఆశ్చర్యంగా.

నవ్వింది గీతిక "మీ కాశ్చర్యంగానే వుండచ్చు మీకే కాదు విన్న వాళ్ళందరూ ఆశ్చర్యపోతారు కాని ఒకటి చెప్పాలి. ఇన్నాళ్ళకి మీరిచ్చిన ఈ పుస్తకాలవల్ల నాకు మనశ్శాంతి లభిస్తోంది అందుకు మీకెప్పటికి కృతజ్ఞురాలిని..."

"మీరు తొందరపడకండి ఆనందం— విషాదం, శాంతి అశాంతి, అన్నివి మన చేతుల్లోనే వున్నాయి. ఇవి కూడా చదివి చూడండి—" తన చేతిలోని మరికొన్ని పుస్తకాలు అందించాడు ఆమెకి చరణ్.

ఆ మూడు, నాలుగు రోజుల్లోనే సన్నిహిత మయ్యారు గీతికా చరణ్ లు!

(ఇంకా వుంది)

## సెంటులోవాడే పొగాకు నూనె

పొగాకు మనుషుని ఆరోగ్యానికి చెరుపు చేస్తుందని వైద్యశాస్త్రం ఎన్నడో తేల్చిచెప్పినప్పటికీ, పొగాకును సమాజ శ్రేయస్సుకు వినియోగించుకొనవచ్చు దానిని ప్రత్యేకించి శుద్ధిచేసి దానినుండి నూనెను తీయవచ్చు ఇది శక్తివంతమైన యాంటీ సెప్టిక్‌గా ఉపకరిస్తుంది. దీనిని మానవునికి ఉపయోగకరమైన లోషన్స్, క్రీములు, సౌందర్య పోషకాలకు పుపయోగించవచ్చు

ఈ సంవత్సరం జార్జియాలో 4000 కిలోల పొగాకు నూనెఉత్పత్తి అయ్యింది. సౌందర్య పోషకమైన ఒక సీసా పెర్ఫ్యూమ్‌ను ఉత్పత్తి చేయడానికి ఒక గ్రాము పొగాకు నూనె చాలు.

ఈ పొగాకు నూనెకోసం మాస్కోలోని నొవాయా జర్యాసంస్థ, రీగాలోని జంటార్స్ సంస్థలు ఆర్డరులు పెట్టాయి. ఫ్రాన్సు, అమెరికాలు కూడా పొగాకు నూనెకోసం పెద్ద ఆర్డర్లు పంపాయి.

## ఒక్కరే

నీవు వరించిన జీవితాన్ని
అతడెవరో హరించాడు—
నీవు తలదాల్చిన కుసుమాన్ని
అతడు నలిపి నేలరాల్చాడు.
నీవు—అతడు యేకోదరులే కాదు,
ఒకరేగాని యిద్దరు కానేకాదు.

## గురువు

గుర్రాన్ని నీవు చెరువుకు
తీసుకు పోగలవు
దానిచేత బలవంతాన
తాగించలేవు నీరు

గురువు నీకు మార్గాన్ని
చూపించగలడు
కాని ఆ పథానికి నిన్ను
అతికించలేడు

— 'శ్రీ విరించి'

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది ?




ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.

స్నానము తరువాత మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. ఇది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు, చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే

Johnson & Johnson

* Trademark © J&J 71

OBM 4316 TEl




ఎన్ని ప్రభుత్వాలు మారినా, ఎంతమంది పాలకులు మారినా, మారని విజయవాడ రూపురేఖలు, పుష్కరాలు మార్చివేశాయని జన వాక్యం బయలుదేరింది. వినోద కార్యక్రమాలు రాత్రీ పగలూ కూడా యాత్రికుల్ని అలరింపజేశాయి తెల్లవార్లూ వుండే నాటకాలు, ఎగ్జిబిషన్, భక్తిని ముక్తినీ చేకూర్చే తిరుపతి దేవస్థానం వారి కళాక్షేత్రం లోని దేవాలయ సముదాయం యివన్నీ తిరిగిన రామారావు అనుకున్న ప్రకారం దుర్గా ఘటం దగ్గరికి వెళ్ళేసరికి, అక్కడ జన సందోహం యిసుకవేస్తే రాలటంలేదు. మైకులలో రకరకాల హెచ్చరికలతోపాటు, పిల్లలు తప్పిపోవటం, తప్పిపోయిన పిల్లలను మైకుల దగ్గర పెట్టి ఏడిపించటం అంతా వింతగా అనిపించింది రామారావుకి

రామారావుకి 'ఈత' వచ్చు. అంచేత కొంచెం ప్రక్కన లోతు నీటిలో స్నానం చేయాలనుకుని, అవతలగా వెళాడు. పోలీసుల కళ్ళు కప్పి మరీ లోతు నీటిలో మునిగిపోబోతున్న ఒక అంగనను రామారావు చూసి రక్షించాడు. ఆమె అప్పటికే నీటిలో మునిగి చాలా నీరు త్రాగింది అంతా గుమిగూడి ఆమె త్రాగిన నీరును కక్కించారు. ఆమె ఆత్మహత్య కోసం అంతపనీ చేసిందని రామూ అనుకున్నాడు. ఇదంతా తెలిస్తే పోలీసులు గొడవ చేస్తారని, ఆమెను కొంచెం దూరంగా తీసుకువెళ్ళాడు రాము

"ఎవరా అమ్మాయి?" ఒక పోలీసు ప్రశ్న.

"నాకు తెలిసిన అమ్మాయిలెండి ప్రమాద వశాత్తూ పక్కకు లోతునీళ్ళలోకి వెళ్ళింది" రామూ తడుముకోకుండా చెప్పాడు

"అవునా అమ్మా!" ఆ అమ్మాయిని అడిగాడు వాలంటీరు

అవునన్నట్లు తలవూపింది ఆ అమ్మాయి, యింకా ఏమి విపత్తు జరుగుతుందో నసే భయంతో.

ఆమె ప్రవర్తన రామూకి విడ్డూరంగా కనిపించినా, ఆ పరిస్థితిలో ఏ స్త్రీ అయినా అంతకన్నా ఏమి చేస్తుందని సరిపెట్టుకున్నాడు

నేను ఆ క్షణంలో దైవికంగా అడ్డుపడకపోతే ఆమె ప్రాణాలు ఆ క్షణంలో అనంతవాయువుల్లో కలిసి పోయేవికదా! అనుకున్నాడు రామూ.

"ఎందుకింత అఘాయిత్యానికి పాల్పడ్డావు? ఆత్మహత్య నేరమని తెలుసా?" అందంగా అలంకరించుకొని కృష్ణానదిలో ఆత్మహత్యకు ప్రయత్నించిన ఆ యువతిని అడిగాడు రాము

"చచ్చిపోవాలనుకున్నాను. మీరు అనవసరంగా నా జీవితాన్ని పొడిగించారు" ఆధునిక అలంకరణలో వున్న యువతి సమాధానం.

"చచ్చిపోదామనుకున్న మీకు యీ అలంకరణ ఏమిటి? ఈ హంగు దేనికి?" ఆమె వంక, రాము అనుమానంగా చూస్తూ అన్నాడు

"ఏమిలేదండీ! బి. ఏ. వరకు చదువుకున్నాను అన్నీ వున్నాయి. కాని ఏభై ఏళ్ళ మేనమామకిచ్చి నన్ను పెండ్లి చేయాలని మా వాళ్ళు నిశ్చయించారు మా మేనమామకి చాలా ఆస్తి వున్న మూలంగా ఆస్తికి ఆశపడి మా వాళ్ళు అటా నిర్ణయించారు. కాదంటే చంపేస్తామంటున్నారు అందుకే మా యింట్లో నుండి పారిపోయి వచ్చాను" తన కథ జాలిగా చెప్పింది ఆ అబల

అసలు విషయం అప్పటికి అర్థమైంది. "యీ దేశంలో నూటికి అరువది మంది యువతులకి కలిగే అన్యాయమే యిది!" అనుకున్నాడు రామూ.

ప్రక్కనేవున్న సూట్‌కేస్‌తో అక్కడే నిలబడిందా యువతి

"మీ పేరు?" రామూ అడిగాడు.

"రాణీ అంటారండీ" మామూలుగా సమాధానం.

# మిల్క్‌మెయిడ్
## రుచికరమైన పాల తయారీకి

అతి రుచికరమైన పాలకోసం
3 అనువైన పద్ధతులు.

400 గ్రా. మిల్క్‌మెయిడ్ డబ్బాను తెరవండి.




అందులో వున్నదాన్ని 2 లీటరు పాత్రలో పోయండి



ఖాళీ అయిన మిల్క్‌మెయిడ్ డబ్బాతో కొలిచి 3-4 రెట్లు మీ రుచిని అనుసరించి నీళ్లు కలపండి బాగా కలపండి. అత్యంత రుచికరమైన తీయని పాలు మీకు లభిస్తాయి



ఇప్పుడు చెప్పినట్లు కలిపిన పాలు వంట పదార్థములు చేయడానికి మరియు సాధారణ వాడకమునకు మాత్రమే

కావలసిన విధంగా రుచికరమైన తీయని పాలను తయారుచేసుకున్న తర్వాత, ఆ పాలతో మీరు పాయసం, మిల్క్‌షేక్స్, రాజ్‌భోగ్, బర్ఫీలాంటి నోరూరించే రుచికరమైన తీపి తినుబండారాల్ని తయారుచేసుకోండి మిల్క్‌మెయిడ్‌లో తీపి వున్నది. ధరలు పెరిగిపోతున్న ఈ రోజుల్లో మీకు పంచదార ఖర్చు కలిసివస్తుంది కూడా.




## మిల్క్‌మెయిడ్
## అతి రుచికరమైనది

CAS-500R


సంతానము
గర్భాశయ వ్యాధులు
సుఖ ప్రసవము
సెక్స్ ఆంతరంగిక
సమస్యలు
మొలలు, చర్మవ్యాధులకు
అనుభవ చికిత్స.
పోస్ట్ ద్వారా చికిత్స కలదు.

సరోజ నర్సింగ్ హోమ్
(డా॥ ఎస్ సరోజినీదేవి - డా॥ వి మధు)
(సెక్స్ స్పెషలిస్ట్)
10 శ్రీనివాసమహాల్, గణపతిరావురోడ్ విజయవాడ 1
బ్రాంచి జిన్నాటవర్ శీలంవారి వీధి గుంటూరు
తెనాలి మారీసుపేట పెనపాడు రోడ్.

సినీ తారలు

ఏయన్నార్, ఎన్ టీఆర్, శోభన్‌బాబు, కృష్ణ, కృష్ణంరాజు వగైరా హీరోల జీవిత విశేష పుస్తకంగాని, ఒక సినీతార కార్డు సైజు ఫొటో గాని 3 రూ. తెలుగు, హిందీ తారల అడ్రస్సుల పుస్తకం 2 రూ. ఈ క్రింది అడ్రసుకు ఎం. వో. చేసినవారికి పంపబడును.

వై. కె. మూర్తి,
దాసరివారి వీధి, విజయవాడ-2.



తయారుచేయువారు
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్సు Regd
P.B.No. 35,
1 పట్టాభి మార్కెట్ ... మచిలీపట్నం
2. శేషయ్య వీధి ...... విజయవాడ-1
3 ట్రంకు రోడ్డు ......... నెల్లూరు
4 G కార్ స్ట్రీట్ ......... తిరుపతి
5 గాంధీ రోడ్డు ......... తిరుపతి
6 సుభాష్ రోడ్డు ...... అనంతపురం
7. ఎవెన్యూ రోడ్డు ...... బెంగుళూరు
8. గాంధీ బజారు ...... బెంగుళూరు
9 గాంధీ బజారు ......... షిమోగా
10. మునిసిపల్ మార్కెట్ ...... కర్నూలు
11. జయంతి బిల్డింగ్స్ ...... బెంగుళూరు
12. మద్రాసు రోడ్డు ......... కడప..
13 రామన్‌కోయిల్ స్ట్రీట్ .... చిత్తూరు
14. నాగులకుంటరోడ్డు . నంద్యాల
15. గాంధీవిగ్రహంవద్ద . నర్సరావుపేట
16. అమ్మవారిశాలవద్ద, మార్కాపురం.


# పుష్కర కన్య

"మరి యీ సూట్‌కేసు, యీ డబ్బు ఏమిటి" అడిగాడు రాము.

"మొదట ఏదో వుద్యోగంచేసి బ్రతకాలను కున్నాను. కాని వెచ్చటకు వెళ్ళినా మగవారి మోసాలు; ఆడవారిని ఆదరిస్తున్నట్లు నటించి కామవాంఛలు తీర్చుకోవటం, వారిమీద అత్యాచారాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. చివరకు యీ జీవితం చాలించాలనుకున్నాను" అసలు విషయం చెప్పింది రాణి.

"పదండి! మీ యింటికి పంపుతాను" రామూ అన్నాడు.

"బాబోయ్! మా యింటికి వెళితే నన్ను బ్రతకనివ్వరు" అంది.

"సరే! మా యింటికి వెళదాం రండి" అన్నాడు రాము ఫోజుగా.

విధిలేక ఒప్పుకుంది రాణి. వేటగాడిముందు లేడిపిల్లలాగా చాలా అమాయకురాలిలా కనిపించింది

రామూ ఉద్యోగంలో చేరి చాలా కాలం అయినా పెళ్ళి కావలసిన యిద్దరు చెల్లెళ్ళు, చదువుకునే తమ్ముడుని, తల్లి, తండ్రిని పోషించే భారం వుండటంవల్ల రాము యింకా పెళ్ళి చేసుకోలేదు. రామూ తల్లి, తండ్రీ, వారి సొంత వూరులో వుంటున్నారు. ఆతని కుటుంబ బరువు బాధ్యతలు చూడటం రాము ప్రథమ ధ్యేయం

రామూతో పనిచేసే మరి యిద్దరు బ్రహ్మచారులు సోమేశ్వరరావు, భీమేశ్వరరావు కూడా రామూతోనే వుంటున్నారు. అందరూ వీరిని రాము, సోము, భీము అని పిలుస్తారు.

సోమేశ్వరరావుకి యీ మధ్యనే ఉద్యోగం వచ్చింది పెద్ద కట్నం ఆశించటంవల్ల, అతనికి పెళ్ళి కావటం లేదు భీమేశ్వర రావుకి మేనమామ కూతురుంది. ఆమె చదువు పూర్తయ్యే వరకూ పెళ్ళి ఆపా లన్నారు. మేనమామ ఆస్తిమీద మమకారంతో "భీము" యింకా పెళ్ళి చేసుకోలేదు.

రామూరావు రాణిని తీసుకొని వెళ్ళగానే బ్రహ్మచారులు ముగ్గురు కలిసి వుంటున్న యింట్లోని చిన్నగది ఖాళీచేసి ఆమె కిచ్చారు. ఆమె అందం అందరిని ఆకర్షించింది. మన్ను తిన్న పెంజేరులా వుండే రామూ అంత అందమైన అమ్మాయినే కాకుండా, చాలా డబ్బు, నగలూవున్న అమ్మాయిని పట్టాడనే ఆవేదన సోము, భీములని వేధించ సాగాయి

"అయితే పుష్కర స్నాన మహత్యం ఆతనికి అనుకూలించిందిలే" అనుకున్నారు.

"కృష్ణవేణి పుష్కర కన్యను ప్రసాదించిందిరా నీకు" అన్నారు వారిద్దరు.

అన్నీ వున్నా అణిగి మణిగి వుండే ఆ అమ్మాయిని చూస్తే చుట్టుప్రక్కల వారికి కూడా ముచ్చట వేసింది.

రోజులు దొర్లిపోయాయి.

"ఎంతకాలం యిలా బ్రతకమంటారు" కన్నీటితో అంది రామూతో ఒకరోజు రాణి.

"తొందరపడకు రాణీ! కొంచెం కాలం అనుకూలించగానే మనం పెండ్లి చేసుకుందాం" అన్నాడు రాము.

"నాతోపాటు మీరు కూడా బాధ పడతారా?" రాణి బాధగా అంది.

"ఏం పర్వాలేదు. మావాళ్ళు అంగీకరిస్తారు. పరే ముందు నీ నగలు, డబ్బు మీ వాళ్ళకి కబురుచేసి యిచ్చేద్దాం. నేను వున్నానుగా" రాము తన అభిప్రాయం చెప్పాడు.

"ఒద్దండి! అంత బంగారం, డబ్బు వాళ్ళకిచ్చి మీకు భారం కావటం నా కిష్టం లేదు. ఈ విషయంలో నన్ను బాధ పెట్టవద్దు" రాణి తన అభిప్రాయం చెప్పింది.

ఒకరోజు అనుకోకుండా మధ్యాహ్నం ఆఫీసునుండి యింటికి వచ్చాడు సోమేశ్వర రావు. సరాసరి రాణి గదిలోకి వెళ్ళాడు. రాణి స్నానాల గదిలోనుంచి అప్పుడే వచ్చింది. బట్టలు సరిగా లేవు.

రామూకి ధర్మపత్ని అవుతున్న తరువాత సోము, భీము తనను సోదరిలా చూస్తున్నారనుకున్న రాణికి, సోము రాక భయాన్ని ఆశ్చర్యాన్ని కల్గించాయి

"పరవాలేదు, తరువాత బట్టలు అవి అలంకరించుకుందురు, యిలా రండి. మళ్ళీ నేను ఆఫీసుకి వెళ్ళాలి" అన్నాడు సోము

చేసేదిలేక అలాగే వచ్చింది రాణి.

"ఏమిటి చెప్పండి? అంత అర్జంటు?" సోముని అడిగింది

సోము కన్ను ఆమె అందాన్ని త్రాగాలా అన్నట్లు తిలకించసాగాయి. ఆమె అంగ సౌష్ఠవం అతనిలో ఎన్నో వూహలు రేకెత్తించింది.

(44 వ పేజీ చూడండి)

# దిట్టమైన జత
# అన్ని కాలాలకు పాదరక్ష



# TROT®
## ట్రాట్-ప్లాట్‌ఫామ్

| | | |
|---|---|---|
| మగవారివి | 7 – 10 | రూ. 16.50 |
| ఆడవారివి | 2 – 6 | రూ. 15.25 |
| పిల్లలవి | 9 – 1 | రూ. 10.75 |

స్థానిక పన్నులు అదనము



# TROT®
## ట్రాట్-కుషన్

| | | |
|---|---|---|
| జయింట్స్ | 11 & 12 | రూ. 14.50 |
| మగవారివి | 7 – 10 | రూ. 12.99 |
| ఆడవారివి | 2 – 6 | రూ. 11.99 |
| పిల్లలవి | 9 – 1 | రూ. 9.95 |
| శిశువులవి | 6 – 8 | రూ. 8.30 |

స్థానిక పన్నులు అదనము

అదనపు
మెత్తదనము
మరియు
సౌకర్యము

Grant. DRP. 10Tel

గతిశీలురైన "డైనమిక్" వారివద్ద ఎన్నెన్నో క్రొత్త క్రొత్తవి ఉన్నాయి మీకు

ట్రాట్ ట్రేడ్‌మార్క్ స్వంతదారు
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4ఎ, మున్షీగంజ్ రోడ్, కిద్దర్‌పూర్, కలకత్తా-700 023

తయారీ లైసెన్స్ పొందినవారు
DRP
డైనమిక్ రబ్బర్ అండ్ ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహాదేవపుర పోస్ట్, బెంగళూరు-560 048

మనసుకు నచ్చిన పిల్లే మరి పెళ్ళికూతురు
ప్రేయసి మెచ్చిన చీరే మరి చీర





Balkrishna




ప్రకృతి ప్రసాదించిన మహత్తర కానుక-ప్రత్తి.
అంటులోనుంచి దారాన్ని తీసింది మానవుడు.
సాధించిన ఘనత అపూర్వం.
ఆ రెండింటి అందమైన కలయికకు ఫలం
బాలక్రిష్ణావారి 'మేనక' చీర
వెల్వెట్‌లా మెత్తగా
చెప్పనలవికాని డిజైన్లలో!

★ 100% పాలియెస్టర్—
• లా-ఇంటిమేట్ • మొనాలి • ఈవ్స్ బ్యూటీ
★ టెర్రిఫిల్ షిఫాన్
★ వైకాట్-2
★ సిలోక్రా
★ టెర్రీసిల్క్
★ టెక్సాఫిల్
★ సిల్క్రానా

మేనక
ప్రకృతితోనూ, వస్త్ర సాంకేతిక శాస్త్రంతోనూ ఒకటై, ఏకమై,

బాలక్రిష్ణా టెక్స్‌టైల్స్ ప్రైవేట్ లిమిటెడ్
నరోల్ (అహ్మదాబాద్)



## సీరియల్ ప్రారంభం!

ఉదయం పదిన్నర గంటలయింది. అదరా బాదరాగా అడుగుపెట్టిన గుమస్తాలు కాగితాలూ, ఫైళ్లు సర్దుకుంటున్నారు.

నీరజ ఆఫీసులో అడుగు పెడుతూనే ఠీవిగా దర్పంతో నలు మూలలా చూసింది. హాలులో అందరూ తనవేపే చూస్తున్నారు నీరజకు అంతా కొత్తగా వుంది. కొత్త అనుభవం ఆమె నాలు గడుగులు వేసిందో లేదో.... అప్పుడే స్ప్రింగు డోరు తెరుచుకుని వస్తున్న ప్యూను ఫైళ్లు టేబిలుమీద పెట్టి "యెవరు కావాలమ్మా ? అని వినయంగా అడిగాడు.

"ఆఫీసరుగార్ని చూడాలి" అంది

"కార్డు ఏమైనా యిస్తారా ? లేక ఆ పనేమిటో రాసిస్తే ఆఫీసరుగారికి యిస్తాను" అన్నాడు

నీరజ చిరాగ్గా చూసింది. ఆఫీసులో అందరూ ఆమె అందాన్నీ, ఠీవిని పరిశీలిస్తున్నారు. నీరజకు చిరాకేసింది తను వచ్చిన పనివేరు. మధ్యలో ఈ ప్యూనుగాడు దాపురించకపోతే ఈపాటికి తను సూటిగా లోపలకు పోయేది తెల్లకాగితం మీద పేరు రాసిచ్చింది. కానీ యెంతసేపటికీ పిలుపురాలేదు

"ఇలా కూర్చోండి యెంతసేపని నిలబడతారు ?" అన్నాడు రాంబాబు, రాస్తున్న కాగితం సగంలో ఆపి తన సీటు దగ్గర స్టూలుమీద ఉన్న కాగితాలు తీసి టేబిలుమీద పెట్టి సౌజన్యత పుట్టిపడే స్వరంతో

"థ్యాంక్స్" చెప్పి నీరజ కూర్చుంది మళ్లా హాలంతా కలయజూసింది తను వున్నంతసేపూ కలాలు పట్టి యెవ్వరూ రాయరేమోనను కుంది ఆభావనలోనే చిరునవ్వు పెదాలమీద గర్వంగా లాస్యం చేసింది రాంబాబు వేపు నీరజ దీక్షగా చూసింది అతను తనకేమీ పట్టనట్లు తదేకంగా రాసుకుపోతున్నాడు పొడుగ్గా, పచ్చగా, అందంగా వున్న వేళ్లమధ్య అతని కలం నాట్యం చేస్తున్నది

"మీరు యిక్కడ ..." అర్థోక్తిలో ఆగిపోయింది

"గుమస్తా పని చేస్తున్నాను" అన్నాడు రాంబాబు వాక్యం పూర్తిచేస్తూ, నీరసంగా నవ్వి

ఇంతలో ఆఫీసరు నుండి పిలుపు వచ్చింది నీరజకు

* * *

నాలుగురోజుల తరువాత ఆఫీసులో స్టెనో కమ్ క్లర్క్‌గా చేరిన నీరజను చూసి ఆశ్చర్య పోయారు ఆఫీసరు రంగనాథన్ మేనేజరు శివకుమార్ దగ్గరకు పంపించాడు పరస్పర పరిచయమైన తరువాత శివకుమార్, ఆమెకు పద్ధతులు, నోట్సు రాయడం, డ్రాఫ్ట్స్ రాయడం చెప్పాడు వివరంగా

శివకుమార్ అందంగా వుంటాడు ముఖంలో ఠీవి, అధికార దర్పం వెల్లివిరుస్తూ వుంటుంది ఆ కళ్లల్లో ఆమెకో విపరీతమైన లాలన, ఆకర్షణ కనిపించింది

నీరజ ఆఫీసులోకి వచ్చిన తరువాత దైన్య వాతావరణం చాలావరకు తగ్గిపోయింది ఆమె చూపుల నాకట్టుకోవాలని, ప్రతివారు తాపత్రయ పడేవారు ఆమెకన్న ముందుగా వచ్చేవారు ఆఫీసుకి ఏదైనా విషయం కలుగజేసికొని మాట్లాడేవారు కొంతమంది కళ్లతోనే పలకరించి పోయేవారు ఇదంతా చూసి నవ్వుకునేది నీరజ ఆఫీసు వదలగానే రిక్షా ఆమెకోసం ఎదురు చూసేది

ఒకనాడు వర్షం కుండపోతగా కురుస్తోంది రిక్షా రాలేదు వన్నగారి రివటలు వేస్తూ గిలిగింతలు పెడుతోంది ఐదు గంటలు దాటినా వర్షానికి బెదరి గుమస్తాలు సీటుల్లోనే కూర్చుని

పనిచేసుకుంటున్నారు గొడుగులు వున్నవాళ్ళు బయటకు వెళ్ళిపోతున్నారు బయలుదేరిన శివకుమార్ నీరజ ముందు వచ్చి ఆగిపోయాడు. నీరజ ఆశ్చర్యంగా చూసింది

"వర్షంగా వుంది నీరజా! రండి నా కార్లో డ్రాప్ చేస్తాను" అన్నాడు ఆమె కట్టుకున్న నేతచీర చూస్తూ

"అక్కర్లేదండీ! కాస్త వర్షం తగ్గితే రిక్షా వస్తుంది కదా!" అంది పేపరు చూస్తూ కానీ శివకుమార్ ఒప్పుకోలేదు

"చీకటి పడిపోయింది నీరజా! అందులో ఒంటరిగా ఎలా వెళతారు?" శివకుమార్ బలవంతం చేసాడు నీరజకు తప్పనిసరి అయింది ఆఫీసు నుండి బయటకు నడుస్తూ రాంబాబు వైపు చూసింది అతను దీక్షగా ఏవో రాసుకుంటున్నాడు ఆఫీసులో అందరూ శివకుమార్ వెంట వెడుతున్న నీరజను ఆశ్చర్యంగా చూశారు.

ఒంటరిగా ఎవరో వ్యక్తితో కారులో వెళ్ళడం, అదీకాక ఇంటికి వెళ్ళడం నీరజకు ఇష్టంలేదు కానీ ఆఫీసర్ పిలుస్తుంటే ఎవరైనా ఎలా వెళ్ళకుండా వుండగలరు?

వారిలో శివకుమార్ ఆహ్వానాన్ని మన్నించి నీరజ కారుదిగి, శివకుమార్ మేడలో అడుగు పెట్టింది నీరజకు శివకుమార్ ఇల్లంతా చూపించాడు ఇల్లంతా అధునాతనంగా వుంది ఎయిర్‌కండిషన్డ్ డ్రాయింగు రూము, అలంకరింపబడ్డ అధునాతన చిత్రాలు, కళాఖండాల, ఖరీదైన ఫర్నీచరు, రేడియో గ్రామ్ చాలా బావుంది ఇంతలో వంటమనిషి కాఫీ, బిస్కట్లు తెచ్చింది

"మీ శ్రీమతి పుట్టింటికి వెళ్ళారా? వుంటే ఆమె దర్శన భాగ్యం గూడా లభించేది" అంది నీరజ కాఫీ 'సిప్' చేస్తూ

నవ్వాడు శివకుమార్

"వెనకటికి పురమే లేనిది అంతఃపురం కావాలన్నారట వొకరు నాకింకా పెళ్ళి కాలేదు నీరజా!" అన్నాడు మెరుస్తున్న కళ్ళతో

నీరజ కారణం అడగనూ లేదూ, అతను చెప్పనూ లేదు. ఏపిల్ పండు కోస్తున్న అతని చేతిలో కత్తి, పాలవెన్నెల లాంటి ఫ్లోరోసెంటు దీపం కాంతిలో తళతళ మెరిసిపోతోంది ప్లేట్లలో ఏపిల్ ముక్కలు నీరజ కిస్తున్నప్పుడు, అతని చేతి వేళ్ళు ఆమె చేతిని స్పృశించాయి, క్షణంపాటు. అలా శివకుమార్ కావాలనే చేశాడో, లేక యాదృచ్ఛికంగా జరిగిందో నీరజకు అర్థం కాలేదు

"మరొక సంవత్సరం పని చేశారంటే బాస్‌తో చెప్పి మీకు ప్రమోషన్ యిప్పిస్తాను నీరజా!" అన్నాడు శివకుమార్, ఏపిల్ ముక్క కొరుకుతూ ఆశగా ఆమెవైపు చూసి తరువాత అలా కాస్సేపు సంభాషణ పొడిగింపబడలేదు వర్షం ఆగే సూచనలు కన్పించాయి స్వయంగా దిగబెడతానన్నా వద్దని చెప్పి రిక్షా తెప్పించుకుని వెళ్ళిపోతున్న నీరజను చూసి శివకుమార్ నవ్వుకున్నాడు

* * *

రెండురోజులు పోయిన తరువాత మేనేజర్ గదిలో బెల్లు మ్రోగింది గట్టిగా "ఆ రాంబాబును



పిలు" అన్నాడు శివకుమార్, విలాసంగా సిగరెట్టు కాలుస్తూ అతని కళ్ళు యెదురుగా కొంచెం ఎక్కగా కూర్చుని బాస్ చెప్పిన లెటర్ టైపు చేస్తున్న నీరజమీదనే వున్నాయి నీరజ క్షణంసేపు మిషన్ ఆపి శివకుమార్‌వేపు చూసింది. అతను చూపులు తప్పించుకున్నాడు. నీరజ చేరిన నెలరోజులలోనూ, శివకుమార్ రాంబాబును పిలవటం అదే మొదటిసారి అనుకోకుండా ఆమె చూపులు ఎప్పుడులేనిదీ స్ప్రింగుడోరుమీద ఆగాయి ఆ తరువాత తెరుచుకుని రాంబాబు లోపలకి వచ్చాడు నత్తగా, నల్లగా పెరిగిన గెడ్డం, కాళ్ళకు సగం అరిగిపోయిన చెప్పులు, పూర్తిగా మాసిన బట్టలు నీరజ ఆశ్చర్యపోయింది.

ఆకలిగొన్న పులిలా శివకుమార్ రాంబాబుమీద విరుచుకుపడ్డాడు

"నెలనెలా జీతం తీసుకొంటున్నప్పుడు సరిగా ఉద్యోగం చేయాలని గుర్తుందా? ఈనాళ నీ సీట్లో

## ఎగురుతున్నది

—డా॥ సి నారాయణరెడ్డి

ఎగురుతున్నది పక్షి
మబ్బుల్ని నెత్తితో తన్నుతూ
గాలిని రెక్కల్తో దున్నుతూ

ఎగుర తున్నది మనసు
మౌనాన్ని స్వరంతో బాదుతూ
మగతను మెలకువతో ఈదుతూ

ఎగురుతున్నది చూపు
ఇరుకుల్ని శిఖరాలుగా పెంచుతూ
శూన్యాన్ని ఆకృతిలో అనువదించుతూ

ఎగురుతున్నది రేపు
ముక్కిన చీకట్లను దులుపుతూ
మొలిచే వెలుగుల్ని తొడుగుతూ

నాలుగు టెలిగ్రాములు వచ్చాయి బోలెడంత పని ఎరియర్సులో వుంది నీ సీటు. నీ కింద ఒక అసిస్టెంటును వెయ్యమంటావా? ఎన్నిసార్లు చెబితేనేం సిగ్గు లేకపోతే సరి ఇది మొదటి వార్నింగ్ ఈసారి ఇలా జరిగితే నిన్ను సస్పెన్షన్‌లో పెడ్తాను" అన్నాడు గర్వంగా నీరజవైపు చూస్తూ

"సారీ సార్! నాకు పని చాలా ఎక్కువగా వుంది దానికితోడు మా నాన్నగారు చావు బ్రతుకుల్లో మేం చాలా ట్రబుల్స్‌లో వున్నాం అయినప్పటికీ ఓవర్ టైం చేస్తున్నాను" అన్నాడు రాంబాబు అతని కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి

"ఈ గుమస్తాలకు యిదొక తెగులు ఎందుకు పని చెయ్యలేదయ్యా అంటే, ఒక దండకం లాంటి కష్టాలు వర్ణించేస్తారు నోటి ముందు సిద్ధంగా వుంచుకుంటారు దాంలో యేమనలేం. ఎవరికి లేవయ్యా కష్టాలు వెళ్ళు .. వెళ్ళు ఇవన్నీ సాయంకాలం లోగా పుటప్ చెయ్యి" అంటూ టెలిగ్రాములు విసిరేశాడు కోపంగా

వెనుదిరిగిన రాంబాబు కళ్ళనిండా అశ్రువులు స్రవించడం నీరజ చూసింది ఆమె మనస్సు జాలితో ద్రవించింది అసహనంగా శివకుమార్ వేపు చూసింది 'యెంతో అణకువగా, సభ్యతగా కన్పించిన వ్యక్తిలో, యింత కసాయితనం వున్నదా?' అని ఆశ్చర్యపోయింది తన పనిలో లీనమైపోయింది మళ్ళీ.

"ఇలా వుంటుంది నీరజగారూ! ఆఫీసు, గుమస్తాలూ, మనుషులూ, బాధ్యతలు, పని" అంటూ సిగరెట్టు వెలిగించాడు, ఎంతో ఘనకార్యం చేసినట్టుగా!

నీరజ అతనివైపు చూసి వూరుకుంది ఈమధ్యనే నీరజతో శివకుమార్ పరిచయం మరొక మెట్టెక్కింది. లంచ్ టైములో ప్రతీవాళ్ళ క్యాంటీన్‌కు వెడతారు కానీ వాచ్‌మేన్ కాఫీ, టిఫిన్ రూములోకే తెస్తాడు నీరజకు కూడా తెప్పిస్తున్నాడు, కుమార్ ఒకటి రెండుసార్లు బ్రతిమాలినా వినలేదు

ఇంతలో "అమ్మా! మిమ్మల్ని ఆఫీసరుగారు పిలుస్తున్నారు" అని చెప్పాడు, ప్యూన్ నీరజకి నీరజ టైపు చేసిన ఉత్తరాలుతో రంగనాధన్‌గారి గదిలోకి వెళ్ళింది

* * *

సాయంకాలం చీకటిని కౌగిలించుకుంటోంది దీపాల వెలుతురులో పట్టణం దివ్యంగా వెలుగుతోంది చైతన్య జీవవాహినిలా కదిలిపోతున్నారు, జనం కార్లు, లారీల రణగొణ ధ్వనుల మధ్య చేనేత వస్త్రాలయంలో చీరలు బేరమాడుతున్న నీరజ ఎదురుగా మందుల కొట్లోవున్న రాంబాబును చూసింది పొడుగ్గా, బలహీనంగా వున్నాడు కళ్ళల్లో ఏదో వింత కాంతి, దైన్యత సృష్టిస్తున్నట్టుగా చూపులు పలుకరించాలని వెళ్ళింది

"చాల్లెండి! గతనెల మందుల డబ్బు ఇప్పటికీ యివ్వలేదు ఇప్పుడు మందులు కావాలంటున్నారు. ఎప్పటి డబ్బు అప్పడిస్తేనే మా బిజినెస్ టర్నోవర్ సారీ సార్! ఇలా అయితే మా బిజినెస్ నడవదు. వచ్చే నెలయినా మా బాకీ చెల్లించండి ఇప్పుడు మందులు యివ్వలేం" అంటున్నాడు మెడికల్ షాప్ మేనేజర్

"మీరు అలా అనడం భావ్యం కాదు. మా నాన్నగారు చావు బతుకుల్లో వున్నారు డాక్టరుగారు ఇవి చాలా అర్జెంటు అన్నారు మీరు దయవుంచి యివ్వండి తప్పకుండా మీ బాకీ మొత్తం ఇచ్చేస్తా" అన్నాడు రాంబాబు, బ్రతిమాలుతూ యజమాని మొండిఘటం, అతని బ్రతిమాలడం తలకెక్కలేదు

"యేం కావాలమ్మా?" అని ప్రశ్నించాడు, వెనకాల నిలబడివున్న నీరజని షాప్ మేనేజర్ రాంబాబు వెనక్కు తిరిగి నీరజను చూసాడు అవమానంతో కృంగిపోయాడు

"యేం లేదు. వారికా మందులు ఇవ్వండి బిల్లుల మొత్తం నేను చెల్లిస్తాను" అంది

యజమాని, రాంబాబు యిద్దరూ ఆశ్చర్యపోయారు. రాంబాబు ఏదో మాట్లాడబోయేటంతలో —

"మనిషి ప్రాణం కన్నా డబ్బు ముఖ్యం కాదు నేను చీరలు కొందామని వచ్చాను వచ్చేనెల

# తెలుపుదనం! తెలుపుదనం!
# అసలైన నిజం!




ఎక్కువ తెల్లదనాన్నిస్తుంది!
ఎక్కువ మరగనిస్తుంది!
ఎక్కువ బట్టలను ఉతుకుతుంది!
ఎక్కువ మన్నిక నిస్తుంది!

అధిక ఉతుకులకు
107 స్పెషల్
డిటర్జంట్ బార్

తయారుచేయువారు:
అల్ట్రామెరైన్ & పిగ్మెంట్స్ లిమిటెడ్
రాణిపేట-632 403

CRITERION UP 3744 TE

కొనుక్కుంటాను ముందు మీ అవసరం గడవనీయండి'' అంది నీరజ

రాంబాబు కళ్లలో కృతజ్ఞత మెరిసింది మరుక్షణంలో రాంబాబు, మందుల ప్యాకెట్టుతో, నీరజతో పేవ్‌మెంటు ప్రక్కగా నడుస్తున్నాడు.

''మీరు చాలా అవసర సమయంలో సహాయం చేసారు ఈ ఉపకారానికి మీ ''రుణం'' యెన్నడూ తీర్చుకోలేను'' అన్నాడు

''ఇందులో ఋణ ప్రశక్తి లేదు ఆపదలో వున్నప్పుడే వొకరి కొకరు ఆదుకోవాలి అదే మానవత్వం అయినా రుణం అంటున్నారు కాబట్టి కొంచెం కాఫీ యిప్పిస్తే సంతోషిస్తాను'' అంది నీరజ రాంబాబు యిరకాటంలో పడ్డాడు నెలాఖరు రోజులు. డబ్బులులేవు జేబులో పేలవంగా నవ్వేశాడు నీరజ అది గ్రహించి హోటల్లోకి దారితీసింది

ఫామిలీ రూంలో కూర్చున్నారు గదిలో అద్దాలు, అద్దాల మధ్య వారిద్దరూ

''ఇవాళ మేనేజర్ మిమ్మల్ని నానా మాటలు అన్నాడు'' అంది సంభాషణ ప్రారంభిస్తూ

''అవును నిజమే! వారు యజమానులు మనం పనిమనుషులం'' అన్నాడు

''మీకు మరీ అంత ఓవర్ వర్కు వుందా?'' అంది ఆశ్చర్యంగా

''వుందో లేదో భగవంతుడికి తెలుసు ఈ కాలం పని చేస్తున్నవాడు భూమిలోకి కృంగిపోతున్నాడు కాకా పడుతున్నవాడు ఆకాశంలో వెలుగుతున్నాడు ఎవరికీ అక్కర్లేదు, యీ విషయాలు ఎవరికీ అక్కర్లేదు యెదుటివారి కష్టనిష్ఠూరాలు. ఇలా తయారయింది ఆఫీసు'' అన్నాడు,ఉద్రేకంగా నీరజ ఆశ్చర్యపడింది అతనిలో అంతర్వాహినిగా వుండే వేదన గ్రహించింది

''మరి పెద్ద బాస్‌తో చెప్పలేకపోయారా?'' నీరజ ప్రశ్న ఆమె అమాయకత్వానికి నవ్వుకున్నాడు, రాంబాబు

''మీరింకా సర్వీసుకు క్రొత్తవారు కబట్టి అలాగంటున్నారు నాకప్పుడే అయిదేళ్ల సర్వీసయింది చెప్పుకొని సాధించేది ఏమీలేదు చూస్తాం అంటారు మరీ దయ కలిగితే చిన్న బాస్‌కో నోట్ పంపిస్తారు ఇక చూస్కోండి చిన్న భరతనాట్యం, తనతో చెప్పకుండా పెద్ద బాస్‌తో రిపోర్టు చేసినందుకు అమ్మ పెట్టాపెట్టదు, అడుక్కు తిననివ్వదు ఈ కోపం మనస్సులో వుంచుకుని ఆయన సాధింపులు సాధిస్తారు. పెద్ద బాస్‌కి మనని చెడ్డగా చిత్రించడానికి ప్రయత్నిస్తాడు ఇన్ని వున్నాయి కష్టాలు. ఉద్యోగం కత్తిమీద సాములాంటిది'' అన్నాడు రాంబాబు

ఇంతలో కాఫీ వచ్చింది కాఫీ సిప్ చేస్తున్న నీరజకు మనస్సు పరి పరి విధాల పోయింది

''మీరేం చదువుకున్నారు?'' అడిగింది కాఫీ త్రాగుతున్నవాడల్లా ఆగాడు.

''ఏం చదువుకుంటే యేంలెండి? గుమస్తా చదువుకు పనికిరాని చదువులే చదువుకున్నాను'' అన్నాడు రాంబాబు చిరాగ్గా

నీరజే బిల్లు చెల్లించి బయటకు వచ్చింది

''ఇంక నాకు సెలవు ఇప్పించాలి'' అన్నాడు రాంబాబు చేతులు జోడిస్తూ అతని మనస్సు యింటివేపు పరుగెడుతోంది వడివడిగా అంగలు వేసుకుంటూ పోతున్న అతనిని చూసి నీరజ నిట్టూర్చింది ఇంటివేపు మళ్లింది

గది తలుపులు వేస్తున్న నీరజను లలిత పలకరించి ''ఏం? నీరజా! యింతాలస్యమైంది?'' అంది నవ్వుతూ

అసలు లలితకు, నీరజకు మొదట బస్సులో పరిచయమైంది తను ఉద్యోగం చేయడానికి బయలుదేరినప్పుడే బస్సులో నీరజ లలిత ప్రక్కన కూర్చుంది మాటల సందర్భంలో తన వూరు సంగతి చెప్పింది

''ఉద్యోగం కోసం మీరు యింత దూరం ప్రయాణమా!'' ఆశ్చర్యంగా అడిగింది లలిత దీర్ఘంగా నిట్టూర్చింది నీరజ

''అవునండీ,తప్పదు మరి జీవితం నిర్దిష్టంగా సరిదిద్దుకునే ముందు జీవన సమస్య వొకటి వేధిస్తోంది మేం చాలా పేదవాళ్లం తల్లిదండ్రులు వృద్ధులు వాళ్లని పోషించాలి గత్యంతరం లేక బయలుదేరాను'' అంది నీరజ

''మీరు ఎక్కడ దిగుతారు? తెలిసిన వాళ్లెవరైనా వున్నారా?'' లలిత జాలిపడింది అందంగా వున్న నీరజ ఒంటరిగా చిన్న వయస్సులో

మైసూర్ శ్యాండల్
Mysore Sandal Soap
గొప్ప భారతీయ సంప్రదాయంలో విశిష్టమైన స్నానపు సబ్బు
గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ బెంగుళూరు వారి విశిష్ట ఉత్పత్తి మార్కెట్ చేయువారు ® మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్ బెంగుళూరు
MCA MSS 61 Te

(గత సంచిక తరువాయి)



ఏనుగులకు బాసటగ అరదంబులును వానికి బాసటగ తురగంబులును అవసరమగు చోట్ల నుండ నియమించిరి




విండ్లవారు అడ్డనాయకులు మొదలుగాగల
కాల్బలంబులను తగురీతిని ఏర్పాటు చేసిరి




ధృష్టద్యుమ్నుని సర్వసేనాధిపత్యమున రథికులు
వారికండగ గజ తురగ పదాతి దళంబులు తగు
రీతిని నిలిచి పాండవ బలంబులు అచలవ్యూహం
బుగ నేర్పడిరి ..........
[ఇంకా ఉంది]

జీవన సమస్యను ఎదుర్కొంటోంది తన వయసే వుంటుంది తనూ వుద్యోగం చేస్తున్నది కాబట్టి, ఉద్యోగంలో వున్న సాధక బాధకాలు తనకు తెలుసు యింకా నిర్ణయించుకోలేదందినీరజ.

"మీకు మా యింట్లో రూమొకటి యిస్తాను వుండండి. తర్వాత చూసుకుందాం" అంది. ఆ విధంగా నీరజకు నివాస సమస్య తీరిపోయింది ఇద్దరి అభిరుచులూ, వయస్సులూ ఒకటి కావడం వల్ల వారి స్నేహం, క్షీర నీర న్యాయంలా కలిసి పోయింది. చనువూ, ఆత్మీయత పెనవేసుకున్న స్నేహితురాళ్లయిపోయారు.

నీరజ జరిగిన సంగతంతా చెప్పింది లలిత విని బాధపడింది

"ఇలాంటి సంఘటనలు చిత్రీకరించడంలో బాబు సిద్ధహస్తుడు. ఆయన కథానికలు మీ రెప్పుడయినా చదివారా ?" అనడిగింది

"అవును చదివాను అవన్నీ ఊహలు వరకే పరిమితమై పోయాయనుకున్నాను కానీ యిప్పుడు వాస్తవ ప్రపంచంలో గూడా యిలాంటి వారున్నారని తెలిసింది" అంది నీరజ, బరువుగా తరువాత వాళ్లిద్దరూ లోకాభిరామాయణంలో పడ్డారు ఇంతలో కుర్రాడు క్యారేజీ తీసుకువస్తే నీరజ భోజనానికి వెళ్లిపోయింది — "గుడ్ నైట్" చెప్పి

* * *

"ఇదేనండీ రాంబాబుగారిల్లు" అని చెప్పి సెలవు తీసుకుని వెళ్లిపోయాడు, ప్యూన్. ఇల్లు చూసింది, సగం విరిగిపోయిన పెంకుటిల్లు చిన్నది ముందు పెంటకుప్పలు కొన్ని గజాల దూరంలో మురికికాలువ ధారావాహినిలాగ పారుతోంది కరెంటు లేదని చెప్పడానికి అన్నట్లు తెగిపోయిన వైర్లు, దైన్యంతోబాటు, ఈ దరిద్రంతోబాటు ఈగలు, దోమలు ముసరుకొంటున్న చీకటితోబాటు నృత్యం చేస్తున్న దృశ్యం. నీరజ ముక్కు మూసుకొని లోపలకు వెళ్లింది.

అసలు ఆఫీసులో శివకుమార్,రంగనాధన్‌గార్లు కాంప్ వెళ్లిపోయారు రాంబాబు ఆఫీసుకు సెలవు పెట్టాడు తనకేమీ పని లేదు. రాంబాబు లీవ్ లెటరులో తండ్రిగారికి సీరియస్‌గా వుందని రాసాడు పాపం! ఎలా వుందో అనుకుంది నీరజ లీవ్ లెటర్ చూసి ఒకసారి చూసివస్తే ! ఆలోచన కలిగింది. కాని ఎలా ? ఇల్లు తెలీదు బంట్రోతును అడిగింది.

"అమ్మా ! రాంబాబులాంటి మంచోడికేనమ్మా భగవంతుడు కష్టాలు ఇస్తాడు ఆయనగోరు లేకపోతే యీ ఆఫీసంతా గల్లంతయిపోతుంది" అన్నాడు బంట్రోతు వాడికి రాంబాబంటే అంతో యింతో అభిమానం. వాడే యిల్లు చూపించాడు

తలుపు దగ్గరగా వేసుంది. నీరజ పిలిచింది కానీ యెవ్వరూ సమాధానం యివ్వలేదు తనే చొరవ చేసుకుని మెల్లిగా తలుపు తోసి ప్రవేశించింది లోపల గుడ్డిగా వెలుగుతున్న దీపం దానికి కొంచెం దూరంలో ఒక అరవై ఏండ్ల ముసలాయన, శల్యావశిష్టమై మంచానికి అతుక్కుపోయివున్నాడు శుష్కించిన అతని వదనాన్ని, గుబురుగా పెరిగిన గడ్డం కప్పేసింది మంచంమీదే యింకో ముసలి ముత్తయిదువ కూర్చుని పిచ్చిగా శరీరం తడుముతూ మౌనంగా కన్నీరు కారుస్తోంది

లోపల మండుతున్న కట్టెలమీద అన్నం పొంగి మంటను ఆర్పేస్తున్న దృశ్యం నీరజ వచ్చిన శబ్దానికి ముసలామె వులిక్కిపడి —

"బాబూ ! వచ్చావా ? డాక్టరుగారు వచ్చారా ? పొయ్యిమీద వున్న అన్నం పొంగిపోతోంది మాడువాసన వస్తోంది దింపేయి బాబూ" అంది నీరజ గ్రహించింది, ఆమె రాంబాబు తల్లి అని.

"లేదండీ ! నేను మీ అబ్బాయి కోసం వచ్చాను ఇద్దరం ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాం చూడ్డానికి వచ్చాను" అంది నీరజ తగ్గించిన గొంతుతో

'అలాగా అమ్మా ! రా కూర్చో వాడిప్పుడే వచ్చేస్తాడు నీ పేరమ్మా ?" లడిగింది ఆప్యాయంగా, ఆమె అంత దుఃఖంలోనూ

"నీరజ" సమాధానమిచ్చింది

"చూడమ్మా ! వారు కళ్లు తెరిచారా ?" అంది ఆతృతగా

ఆ ముసలాయనవైపు చూసింది అతను నిశ్చింతగా నిద్రపోతున్నట్లున్నాడు విశాలమైన నుదురు, బాధతో, వేదనతో ముడుతలు పడుతోంది ఉచ్ఛ్వాస నిశ్వాసముల మధ్య వింత అనుభవం భయం వేసింది నీరజకు

"లేదండీ" అంది ముసలామె ఏదో గొణుక్కుంది

మెడలో పసుపు కొమ్ము మాంగల్య సూత్రాన్ని కళ్ల కద్దుకొని, "భగవంతుడా ! ఈ అంధురాలి జీవితం తీసకుని వారిని బ్రతికించు బాబూ" అని ఏడ్చింది నీరజ వోదార్చింది ఆ వోదార్పులో ఆమె కూడా కన్నీరు కార్చింది పొంగుతున్న అన్నం గిన్నె క్రిందకు దించింది చేతులు కాలాయి

ఇంతలో డాక్టర, మందుల పెట్టెతో రాంబాబు వచ్చారు డాక్టరు పరీక్షించాడు

"కేస్ చాలా సీరియస్‌గా వుంది ఇంకెవరి కయినా చూపించండి అన్నట్లు బిల్లు పంపిస్తాను వొకటవ తారీఖున పే చెయ్యండి" అని ఇంగ్లీషులో చెప్పి డాక్టరు వెళ్లిపోయాడు

రాంబాబు నుదురు కొట్టుకున్నాడు

"నాయనా ! డాక్టరుగారు ఇంజక్షను ఇచ్చారా? వారికి బాగవుతుందని అన్నారా ? ఏమన్నాడు చెప్పు నాయనా" తల్లి ఆవేదనగా ప్రశ్నల వర్షం కురిపిస్తోంది

నిరుత్తరుడైనాడు రాంబాబు దుఃఖంలో నీరజ ఉనికే గమనించలేదు

"చూడండీ ! ఇప్పుడిలా ఆలోచిస్తే లాభం లేదు వేరే డాక్టరు నెవరినైనా తీసుకురండి" అంది నీరజ రాంబాబు నుద్దేశిస్తూ రాంబాబు ఆమెవైపు వెర్రిగా చూసాడు

"మీరెప్పుడొచ్చారు ?" అన్నాడు గొంతు పెకిలించుకుని

"చాలా సేపయింది వచ్చి ఎలావుందో చూద్దామని" అంది గాద్గదికంగా కాస్సేపాగి—

"మీరు దేనికీ సందేహించకండి. నా దగ్గిర కొంచెం డబ్బు వుంది తర్వాత చూసుకుందాం" అంది అతన్ని తొందర పరుస్తూ

రాంబాబు ఏదో చెప్పబోయేటంతలో —

"మీరు చెప్పబోయేది నాకు తెలుసు రుణాలు, అరణాలు, భరణాలు సంగతి తరువాత చూసుకుందాం" అని ఆజ్ఞాపించింది గంభీరంగా

రాంబాబు వెంటనే బయలుదేరాడు ఇల్లంతా కలయజూచింది మూలగా విరిగిపోయిన పెంకుల మధ్య చంద్రుడు పలుకరిస్తున్నాడు అస్తవ్యస్తంగా పడివున్న సామాన్లు, పుస్తకాలు, సగం చిరిగిపోయిన ఫోటోలు, కాలు విరిగిపోయిన కుర్చీ, మసిబారిన గిన్నెలు ఇల్లంతా బజారులా వుంది

మంచంలోని రోగి కళ్ళు తెరిచాడు. "దాహం దాహం" అంటూ నీరసంగా అరిచాడు ముసలామె లేవబోయింది. కానీ నీరజ వారించింది స్టూలుమీద పెట్టిన మరచెంబులోని వేడినీళ్లల్లో, గ్లూకోజు డబ్బాలో అడుగున వున్న చెంచాడు గ్లూకోస్ కలిపి త్రాగించింది అది త్రాగేసి ముసలాయన బాహ్య ప్రపంచంతో సంబంధం లేనట్లుగా కళ్లు మూసుకున్నాడు.

"తల్లీ ! నీ వెవరో దేవతలా వచ్చి నన్ముల్ని

## 'ఉత్తరాలు' శీర్షికకి పంపేవారికి మనవి

- ★ ఉత్తరాలు క్లుప్తంగా స్పష్టంగా వ్రాయాలి
- ★ చివర పేరు రాయాలి సంతకం పెట్టినా దాని క్రింది మీరు అచ్చులో పడాలనుకున్న పేరు తెనుగు లిపిలో ఉండాలి
- ★ కథలమీదా, సీరియలు కథలమీదా మొదలైన వాటిమీదా పంపే విమర్శలు — ప్రశంసలు కూడా 'కథ'లు రాసేవారికి, ఆ కథలను తిరిగి అవసరమైతే వెనక్కి పోయి పాత సంచికలలో చదివేవారికి ఉపయుక్తంగా ఉండేలా చూడవని మనవి
- ★ 'ఉత్తరం' తోటి పాఠకులందరూ ఆసక్తిగా చదువుకొనేదై వుండాలి కేవలం ముఖచిత్రం 'హైలైట్' సీరియల్ 'ఎక్సలెంట్' కార్టూన్‌లు 'సుపర్బ్' అని గాకుండా అది ఏ ముఖ చిత్రమో ఏ పేజీకార్టూనో, ఆ సీరియల్ హైటిలేమిటో వ్రాయడం అవసరం
- ★ కాపీ కథ' కాపీ కార్టూన్ అని రాసేవారు — సదరు కాపీ దేన్నుంచి జరిగిందో దాని వివరం వీలైతే ఒక కాపీ పంపితే ఎంతైనా మేలు
- ★ ఉత్తరాలు త్రిప్పి పంపడం— రాసిందంతా వెయ్యడం సాధ్యం కాదు
- ★ ఉత్తరాల శీర్షికను కూడా అందరూ చదివే పేజీగా చేయడానికి మా పాఠకులు దోహదించాలని మనవి.

— సం

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

వి ఎస్ — వల్లూరిపాలెం

ఈ ప్రపంచంలో మనిషికి ప్రధానం ధనమా? గుణమా?

★ చూడు నానీ, డబ్బుంటే — అన్ని సుగుణాలూ వున్నట్టే ఉంటాయి. అది పోయిందనుకో దుర్గుణాలన్నీ బయటపడిపోతాయి. అందుకే ఈ ప్రపంచంలో దరిద్రుడు చెడ్డవాడుగానూ ధనవంతుడు మంచివాడుగానూ చెలామణీ అవుతారు, అవుతున్నారు.

ఎల్. వి. — కలిదిండి

కలువకు చంద్రుడు ఎంతో దూరం కదా, మరి మీరు మీవారికి

★ పక్కలో బల్లెం బాబూ, కొంప కదిలి ఓ పూట పుట్టింటికి కూడా పోను! అయినా కలువా చంద్రుల దూరం 'ఎంత ఎంత దూరమైన అంత తీపి' కదా! చేరిక.

ఎల్. వి. యు. ఎస్ బి — భువనేశ్వర్

చిత్రం ఎంత విషాదాంతం అయినా చివరకు శుభం అని చూపిస్తారు ఎందుకని?

★ 'శుభం! వెళ్ళిమళ్ళీరండి.' అని దాని అర్థం అది హాల్లో ప్రేక్షకులకు కాని — చిత్రానికి కాదు.

డి ఎమ్. బి — ఆదోని

మానవుడు నానాటికి అధఃపాతాళానికి దిగజారి పోతున్నాడు ఈ కాలంలో అతని జీవన ప్రమాణం పెరిగే అవకాశం ఎలా?

★ ఏముందీ - ఏదైనా పూర్తిగా నాశనమైతేనేగద పునః సృష్టికి ఆస్కారం ఈ పతనం పూర్తికావాలి

రచనలో ఇతివృత్తం, శిల్పం దేనికి ప్రాధాన్యం యివ్వాలి?

★ ఇతివృత్తం బలమైనదైతే — శైలి ఎంత సామాన్యమైనా, శిల్పం అంతంత మాత్రంగానే వున్నా నదివిస్తుంది

ఎమ్. ఆర్. ఆర్ — న్యూఢిల్లీ

మీరు ఏ సినిమాకైనా డైలాగులు రాశారా? యింక దేనికైనా రాస్తున్నారా?

★ రాశాను అభిమానవతికి! కాని అది మనకు తెలియని విద్య అనిపించింది. మళ్ళా దేనికీ మాటలు రాయడంలేదు. చేతనైనదనుకుని కథలకే పరిమితం చేశాను నా టేలెంటు!

ఎమ్. పి. ఆర్. — అమలాపురం

కట్నాలు కానుకల ప్రభావం చట్టాలవలన సభలవలన ఏ మాత్రం తగ్గేట్టులేదు?

★ మనిషి మారేదాకా యివి పోవన్న సంగతి అటు ప్రభుత్వానికీ యిటు వ్యక్తులకీ కూడా బాగానే తెలుసు. వ్యక్తుల విశాల దృక్పథం, వ్యక్తుల అభ్యుదయ కాముకత్వం — సంఘానికి ఉపయోగిస్తాయేగాని — సంఘం ప్రభుత్వం విధించే కట్టుబాట్లను — ఒక్క క్షణంలో తోసిరాజన కలరు వ్యక్తులు అందుకే సంఘ సంస్కరణకి నాంది వ్యక్తి సంస్కరణ

టి వి ఎస్, టి ఎస్ ఆర్. — అండలూరు

ప్రతి స్త్రీ తన భర్త శ్రీరామచంద్రుడు కాకుండా శ్రీకృష్ణునిలా వుండాలని కోరుకుంటుందట కామెంట్?

★ అది ప్రతి మగవాడి తీరని కోరిక అయి వుంటుందని నా అభిప్రాయం కృష్ణుని లాంటి సోదరుడూ రాముని లాంటి భర్తా కావాలని కోరుకుంటుంది ఆడది

డి. వి ఆర్ — మధిర

నటి విజయనిర్మలగారు 'ఆడజాతి అంటేనే నాకు భయం' అన్నారు కామెంట్?

★ అలా అనుకొనే వ్యక్తి కాదు శ్రీమతి విజయనిర్మల అలా అనుకునే మనిషైతే 'సంఘం చెక్కిన శిల్పాలు' తీసి వుండేవారా?

జి వి ఆర్. — హైదరాబాదు

నిందారోపణ గురించి మీ అభిప్రాయం? ముఖ్యంగా మీ మీద?

★ నిందారోపణ గట్టిగా వినబడేది తప్పు చేసిన చెవులకే! నాకేం వినబడడం లేదు.

ఎస్. ఎస్ ఆర్. — హైదరాబాదు

నేను, ఒక అమ్మాయి స్నేహంగా వుండి ప్రేమించుకున్నాం. వారి తల్లి 'మీది ఆంధ్ర, మాది తెలంగాణ. మా అమ్మాయిని మరిచిపో'మ్మంది ...

★ దెబ్బలు మరిచిపోయినా మచ్చలు మిగిలిపోతాయికదా. అందుకే ఆ తల్లి భయంతో ఆ మాట అని వుంటుంది. మీ ఇద్దరూ మీ ప్రేమ ఎంత బలమైనదో — 'స్వయం పోషకం' అయినదో ఆమెకి నిరూపించడానికి ప్రయత్నించండి ... తిండికీ బట్టకీ దైనందిన జీవితావసరాలకీ — పెద్దలపై ఆధారపడేవాళ్ళు — ప్రేమని గురించి — కాస్త జాగ్రత్తగా ఆలోచించాలి

ఎమ్. ఎస్. ఆర్. — బైపల్లి

కె. జి. హేమలత (కుప్పం)గారి చిరునామా తెలియ చేస్తారా? కలం స్నేహం చేయాలనివుంది?

★ ప్రశ్నావళికి రాసే ఎవరి చిరునామా ఎవరికీ ఇవ్వడం జరగదు! అలాగే చిరునామా ఇవ్వని లేఖలు చదివినా చింపివేయడం జరుగుతుంది

ఏదైనా విషయంలో ఓడిపోతే మరోసారైనా గెలుపొందుతాననుకోవడం అవివేకమా?

★ కాదు ఆశ, ఆశ లేకపోతే మనిషి ముందుకి ఒక్క అడుగు కూడా వేయలేడు!

యు యు —ఎమ్మిగనూరు

సర్వ సృష్టికి ప్రత్యర్థి ద్వేషం? వివరిస్తారా?

★ వివరిస్తారా ఏమిటి? నాకర్థం అయి చస్తే కద! అయినా ప్రత్యర్థిలేని సృష్టి—చప్పగా వుంటుంది

ఎమ్. ఎస్ ఆర్ — విశాఖపట్నం

జయప్రద (సినిమా నటి) చిరునామా తెలియ చేస్తారా? ఎన్నాళ్ళనుంచో ఉత్తరంరాయాలని కోరిక

★ ఈ ప్రశ్న సినిమా పత్రికల వారిని వేయండి ఎడాపేం ఖర్మ వారికి వచ్చే పులుసు కూరల దగ్గరనుంచి తెలియచేస్తారు! ★

---

## రాగబంధితులు

ఆదుకున్నావమ్మా!'' అందామె కాస్సేపు నిశ్శబ్దం గదిలో తాండవించింది

''అమ్మా! నీకు తల్లీ, తండ్రీ వున్నారా?'' ఆమె ప్రశ్న

నీరజ సమాధానం చెప్పింది

''పెళ్ళయిందా?'' నీరజ సిగ్గుపడిపోయి చెప్పింది.

ఇంతలో టాక్సీ ఆగిన శబ్దం డాక్టరుగారు దిగారు చాలాసేపు పరీక్షించి మందులు రాసి యిచ్చారు ఇంజక్షనిచ్చాడు

''మీరొకసారి యిలా రండి'' నీరజ రాంబాబుని పిలిచింది

''ఈ డబ్బు ప్రస్తుతానికి వుంచండి. డాక్టరు ఫీజులకూ, మందులకు అవుతుంది'' అంటూ వంద రూపాయలు రాంబాబు చేతిలో పెట్టింది

డాక్టరును టాక్సీఎక్కు దిగబెట్టి లోపలకు వచ్చాడు

''నేను మందులు కొనడానికి వెళతాను. మిమ్మల్ని గూడా దిగబెడతాను. వచ్చేస్తారా?'' అన్నాడు రాంబాబు

''ఏం నేనుండగూడదా?'' కొంటెగా అంది నీరజ.

రాంబాబు తడబడ్డాడు

''అదికాదు చాలా రాత్రయిపోయింది. మీరు వొంటరిగా వెళ్ళటం బాగుండదని'' నసిగాడు.

''వస్తానమ్మా'' అని రాంబాబు తల్లి పార్వతమ్మ గారితో చెప్పి బయలుదేరింది నీరజ.

''మీరు నిజంగా దేవుడులా వచ్చి రక్షించారు'' అన్నాడు, ఇద్దరిమధ్యవున్న నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ

''తప్పు.. తప్పు దేవుడనకండి. దేవతనండి ఇందాక మీ అమ్మగారు కూడా యిలాగే అన్నారు'' అంది. రాంబాబు నవ్వేశాడు.

''అవును... మీ అమ్మగారు పుట్టుగుడ్డా?''

''లేదండీ! నాకో అక్కయ్య వుండేది ఆమె పెళ్ళీడుకొచ్చి చనిపోయింది అకస్మాత్తుగా మా అక్కను తలచుకుంటూ రోజూ దుఃఖించేది అపుడే కళ్ళు పోయినాయి మా అమ్మకు మా కుటుంబ భవిష్యత్తు వొక విపత్కరమైన పరిస్థితిలో నాశనమైపోయింది'' అన్నాడు భారంగా అతని భుజంమీద కుట్టిన మాసికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి

''ఇంతకీ మీ యిల్లు ఎక్కడో చెప్పారు కాదు ముందు మిమ్మల్ని ఇంటిలో దిగబెట్టి మందులు తర్వాత కొంటాను'' అన్నాడు రాంబాబు

''అక్కర్లేదు ఇక్కడకు దగ్గరే నేను వెళతాను. మీ నాన్నగారి ఆరోగ్యం జాగ్రత! రేపు గూడా అవసరమైతే సెలవు పెట్టండి. గుడ్‌నైట్'' అంటూ రిక్షాను పిలిచింది నీరజ.

వెళ్ళిపోతున్న నీరజకు మనస్సులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

(ఇంకా వుంది)




మల్, సారిక, షిమోనా క్వీన్, సిల్కీ ట్రీట్, అనూరాధ, కస్తూరి

100% పాలియెస్టర్ చీరలు

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.



# లాక్మే లావణ్య రేఖ

మెరుపు లేని సహజమైన సోయగం కోసం సినీతార రేఖ వాడేది లాక్మే పేస్ పౌడర్
పల్చని పట్టు వస్త్రంతో జల్లించబడిన లాక్మే ఫేస్ పౌడర్ చిరచిరలాడించే స్టూడియో
లైట్ల వేడిని తట్టుకొంటుంది అలాగే నిలిచి ఉంటుంది
ఇక అవుట్‌డోర్ షూటింగ్‌లో, ముఖ సౌందర్యాన్ని తొందరగా
తీర్చి దిద్దుకోవడానికి రేఖ వాడేది లాక్మే కాంపాక్ట్
ఇది నాజూకైనది, సొంపైనది, హాండ్ బాగ్‌లో చక్కగా
ఇమిడిపోయేది మీకు మాత్రం రేఖలాగా అందంగా
కనబడాలని లేదూ? అందుకే లాక్మే తెచ్చుకోండి

**లాక్మే అల్ట్రా-సిల్క్ ఫేస్ పౌడర్ మరియు లాక్మే కాంపాక్ట్**



అందాన్ని తీర్చిదిద్దేది- లాక్మే

# Lakmé

daCunha L-53 TL Rev



'ఇల్లాలు'లో ఒక సన్నివేశం

## త్యాగయ్య

ఇంట్లో రామ సాక్షాత్కారం పొందిన త్యాగయ్య జన్మించిన ఊరూ, నేటి పరమనాస్తిక వాది — డి. ఎం. కె. నాయకుడు ము. కరుణానిధి జన్మించిన ఊరూ ఒకటే! అది తంజావూరు జిల్లాలోని తిరువారూర్. మరో విచిత్రమేమిటంటే — ఇప్పుడు "త్యాగయ్య" చిత్రాన్ని నిర్మిస్తున్న ఎన్. కృష్ణంరాజు కూడా నిరీశ్వరవాది. ఆయన నవ్వుతూ, "ఆ రాముడి భక్తునిపై నాకు భక్తి ఏర్పడిందిగాని, ఆయన కొలిచిన రామభద్రునిమీద కాదు," అంటారు. ఆయనతోపాటు బాపు, ముళ్ళపూడి వెంకటరమణ, కె. వి. మహదేవన్, బాబా ఆజ్మీ, భాస్కరరాజు, కె. వి. రావు, మందపాటి రామచంద్రయ్య, టి. ఎం. సంతానం ప్రభృతులు ఎంతో భక్తి శ్రద్ధలతో ఆ నాదవిద్యోపాసకుని గాథను అంతర్జాతీయ స్థాయికి అనుగుణంగా వెండితెర వర్ణకావ్యంగా రూపకల్పన గావిస్తున్నారు.

తిరువారూర్ అంటే మరో విషయం గుర్తొస్తోంది. అక్కడి ఆలయంలో "త్యాగయ్య" చిత్రీకరణ ప్రారంభమైన తొలిరోజున ... త్యాగయ్య భార్య కమలాంబగా నటించే కె. ఆర్. విజయ షూటింగ్‌కు వచ్చిందనుకొని చుట్టుపక్కల ఊళ్ళ నుండి జనం తండోపతండాలుగా వచ్చేశారు. ఇక, ఆమె రాలేదని తెలిశాక వాళ్ళు సహనం కోల్పోయారు. వాళ్ళను అదుపులో పెట్టడానికి పోలీసుల తరమూ కాకపోయింది. ఉన్నట్టుండి సద్దు మణిగింది. మందహాస వదనంతో, ముకుళిత హస్తాలతో జె.వి. సోమయాజులు త్యాగయ్యగా ఆ గుడిలోకి ప్రవేశించగానే — ఇసుక వేస్తే రాలనంత జనంలో సూదిపడితే వినిపించేంత నిశ్శబ్దం! అందరూ సద్భక్తిగించి చూస్తూండిపోయారు. "ఆ త్యాగరాజుకూడా అచ్చం ఈయనలాగే ఉండేవారేమో!" అంది రాజ్యలక్ష్మి అనే పండు ముసలామె. అప్పటికి కొద్దిరోజుల ముందు ఆ ఊళ్ళో "శంకరాభరణం" ప్రదర్శింపబడిందట. తమ అభిమాన శంకరశాస్త్రిని త్యాగయ్యగా చూసి మరింత తరించారు ఆ జనం.

సోమయాజులు కూడా ఒకప్పుడు నాగయ్యగారి లాంటి మహానటులు ధరించిన ఆ సంగీత — సాహిత్య సార్వభౌముని పాత్ర తనకు లభించడం పూర్వజన్మ సుకృతంగా భావిస్తూ, నిష్ఠతో ప్రాణప్రతిష్ఠ గావిస్తున్నారు.

భక్తి సంగీతం ద్వారా తాను తరించి, తరింపచేసిన వాగ్గేయకారుడు త్యాగయ్య. తేటతెల్లని నుడికారంతో — నేర్చుకోడానికి, నేర్పడానికి వీలయ్యేంత సుగమంగా రాగతాళబద్ధమైన కృతులను సర్వజనరంజకంగా రచించి, కర్నాటక సంగీతమంటే తానుగా — తానంటే కర్నాటక సంగీతంగా విడదీయరాని అనుబంధం ఏర్పరచుకున్న త్యాగయ్య పేరు కర్నాటక సంగీతం వినబడినంత కాలం వినిపిస్తూనే ఉంటుందని మరోసారి నిరూపించే మహత్తరమైన చిత్రం నవత సినీ ఆర్ట్స్ "త్యాగయ్య". "శ్రీరామనవమినాడు విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే ఎస్. అచ్యుతరామరాజు.

## సినిమా

—జి. వి. జి.

# మీ చర్మానికి
# ప్రకృతిసహజమైన సౌందర్యం




VEP

ప్రభుత్వ
సంస్థ యొక్క
ఒక విశిష్టమైన
తయారీ

# వేప్

**టాయ్‌లెట్ సోప్**

వేప్ అంతర్గతంగా వెమ్మను కలిగిన సబ్బు. మీ చర్మం ఎండి బీటలువారకుండాను, ముడతలు పడకుండాను సంరక్షించి, అభ్యంగస్నానంవల్ల కలిగే సకల ప్రయోజనాలను సమకూర్చగలదు. దీని సువాసనలీనే పరిమళం మిమ్మావహించుతూ, చర్మాన్ని పరిశుభ్రపరచే దీని గుణం, ప్రకృతిసహజమైన కళ, కాంతులతో, రూప, సౌందర్యాలు వుట్టిపడేటట్టుగా మీకు తగిన సంరక్షణను సమకూర్చగలదు.

మీ చర్మానికి అవశ్యమయ్యే
ప్రకృతిసహజమైన సంరక్షణకు- **వేప్**

**కేరళ సోప్స్ & ఆయిల్స్ లిడ్.,**
కాలికట్.

FDS KSO 3383A TEL



'బంగారు కానుక'లో అక్కినేని, సుజాత

## సినిమా

షూట్ చేయడం జరిగిందన్నారు యువ ఛాయాగ్రాహకుడు గోపాల్ రెడ్డి.

వర్తమాన నాయికా నాయకులకు అరుదుగా లభించే గొప్ప పాత్రలు ముచ్చెర్ల అరుణ, రాంజీలకు ఈ చిత్రంలో లభించాయి. అరుణ హైద్రాబాద్ వాస్తవ్యురాలు. లోగడ "కల్లుక్కుళ్ ఈరమ్" అనే తమిళ చిత్రంలో అద్భుతంగా నటించి, ప్రశంసలందుకుంది. రాంజీ ఎకనమిక్స్ పట్టభద్రుడు. కర్నాటక సంగీతాన్ని అభ్యసించాడు. చక్కగా వేణువు వాయించగలడట కూడా. ఇతను లోగడ 'స్వప్న' చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయుడు. ఇతనికి విద్వాన్ మల్లాదిగారిచే తెలుగు ట్యూషన్ ఏర్పాటు చేయించారు నిర్మాతలు. ఇప్పుడు తెలుగు చక్కగా మాట్లాడగలడు; రాయగలడు. ఒక లొకేషన్‌లో వరి చేలను చూపించి, "నాటివి తెలుగులో విత్తనం చెట్లు — అని అంటారు," అంటూ రమాప్రభ రాంజీతో తమాషాగా అంటే, చుట్టూ ఉన్న వారంతా గొల్లున నవ్వారు. "చాలాకాలం తర్వాత నాకీ పిక్చర్‌లో మంచి కేరెక్టర్ దొరికింది," అంది రమాప్రభ. ఆమె కాదు; ఈ చిత్రంలో నటించే ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, చాట్ల శ్రీరాములు, రాళ్ళపల్లి, కె. విజయ కూడా ఇదే అభిప్రాయాన్ని వెల్లడించారు. "ఆకలిరాజ్యం" చిత్రం ద్వారా తెలుగువారికి పరిచయమైన ప్రతాప్ పోతన్ ఈ చిత్రంలో మూగవాడుగా ఎంత గొప్పగా నటిస్తున్నాడంటే — షూటింగ్ చూడ వచ్చిన కొందరు గ్రామీణుల కళ్ళు చాలా సందర్భాలలో చెమ్మగిల్లాయి. ఇతని పేరు ప్రతాప్ అయినా, ఇంటి పేరు పోతన్. విద్యాధికుడు. సినిమా నటుడవడానికి ముందు ఒక పబ్లిసిటీ సంస్థలో 'కాపీయిస్ట్'గా పనిచేశాడు. 'తకరా' మలయాళ చిత్రం ద్వారా వెలుగులోకి వచ్చాడు. ఆ తర్వాత

'భోగభాగ్యాలు'లో ఒక దృశ్యం



పలు తమిళ చిత్రాల హీరోగానూ ప్రశంసలందుకున్నాడు. సాధారణంగా చిత్రకథ, అందులో తన పాత్ర స్వభావం పూర్తిగా తెలుసుకుంటే కాని, నటించడానికి అంగీకరించడట. కాని, ఈ చిత్రంలో అతని పాత్రగురించి లొకేషన్‌కు వచ్చేవరకు పూర్తిగా తెలియదట. ఈ విషయం చెప్తూ అతను "ఈ యూనిట్‌లో (ప్రొడక్షన్) వ్యవహారాలు చూసే ఎం. ఎ. రెడ్డిగారు ఒకరోజు ఉదయం హఠాత్తుగా మా ఇంటికి వచ్చి, 'మా ప్రొడ్యూసర్ మురారిగారు మీరు నటించిన చిత్రాలన్నీ చూశారట. అందుకే, మా చిత్రంలో ఓ క్లిష్టమైన పాత్రను మీ చేత వేయించాలనుకుంటున్నారు,' అని చెప్పేసరికి ఉక్కిరిబిక్కిరి అయిపోయాను. ఒక తెలుగు చిత్ర నిర్మాత నా మీద అంత విశ్వాసంతో ఒక పాత్రకు ఎన్నుకున్నప్పుడు — వెంటనే 'ఓ — కే' అనకుండా ఉండగలనా? ఇక్కడికి వచ్చాక నాలోని నటుడు విజృంభించడానికి తగిన పాత్ర లభించిందని తెలిసి ఎంతగా ఉప్పొంగిపోయానో!" అన్నాడు.

"వీళ్ళందరూకాక మురళీమోహన్ ఒక

'అమావాస్య చంద్రుడు'లో మాధవి



ప్రత్యేకమైన పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేయడం మరో విశేషం," అన్నారు కె. నరసింహంనాయుడు. ఈయనా, మాగంటి రవీంద్రనాథ్ చౌదరి కలిసి ఈ చిత్రాన్ని సమర్పిస్తున్నారు. ఆత్రేయ, వేటూరి, మహదేవన్, లోటు, జి. జి. కృష్ణారావు తెరవెనుక కృషిచేస్తున్న ఇతర ప్రముఖులు.

పాత్రలకు ఔచిత్యం, సన్నివేశాలకు నిండుదనం చేకూర్చే పదాల లాలిత్యంతో, రాగాల మాధుర్యంతో ఉత్తమంగా తీర్చిదిద్దబడిన ఈ చిత్రంలోని గీతాలను ప్రేక్షకులు చవిచూస్తారు. తొలి షెడ్యూల్‌లో అరకులోయ కాఫీ ఎస్టేట్‌లో వాణీ జయరాం, జేసుదాసు పాడిన "ఎవరమ్మా ఈ కొమ్మ" అనే గీతాన్ని నాయికా నాయకుల మీద ఆరు రోజులపాటు చిత్రీకరించడం జరిగింది.



'మౌన గీతం'లో సుహాసిని, మోహన్

## అగ్నిపూలులో అగ్నిలో ఆజ్యం

మేరీ (దిల్‌జిత్ కౌర్)కు స్పృహ వచ్చేసరికి పక్కన పిల్లలు బాబీ, జేనీ ఆదుర్దాతో చూస్తూ నిలుచొనున్నారు. ఇంతలో డాక్టర్ విశ్వం (సత్యనారాయణ) వచ్చాడు.

''డాక్టర్ ...!'' అంది మేరీ హీనస్వరంతో. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

''ఊరుకోమ్మా! చదివే పిల్లలకే పరీక్ష లుంటాయి. అలాగే మంచివాళ్ళకే పరీక్షలు పెడ్తాడా భగవంతుడు,'' అన్నాడు విశ్వం.

''ప్రసాద్ లేనిదే నేను బతకలేను, డాక్టర్! నేను చచ్చిపోతాను. ప్లీజ్ ... కిల్ మి.''

''మేరీ, ఒక్కసారి పిల్లలకేసి చూడు. చచ్చిపోయిన నాన్నని, చచ్చిపోతానంటున్న అమ్మని చూసి వాళ్ళెంత బెదిరిపోతున్నారో చూడు! అశుభం శుభం తెలియని ఈ పసికందుల కోసం నువ్వు బతకాలి, మేరీ! బతుకు బరువైనా, భారమైనా సరే — బతికి తీరాలి,'' అని విశ్వం అంటున్నప్పుడు

'దేవి దర్శనం'లో ఒక సన్నివేశం

## సినిమా

### విజయభారతి

ఔత్సాహిక కళాకారులలోని కళాభిజ్ఞతను వెలికి తెచ్చి, వారిని ప్రోత్సాహపరచే ఆశయంతో పదకొండు మంది సభ్యులతో గత అక్టోబర్‌లో ప్రారంభించ బడిన ''విజయభారతి'' సాంస్కృతిక సమితికి నటుడు వంకాయల సత్యనారాయణ అధ్యక్షుడు, శర్మ కార్యదర్శి, బి. హెచ్. సాంబమూర్తి కార్యనిర్వాహక కార్యదర్శి. ఈ సమితి ఫిబ్రవరి 6న మద్రాసు 'వాణీమహల్'లో ''జూలియస్ శేఖర్'' అనే నాటకాన్ని రసవత్తరంగా ప్రదర్శించి, బహుముఖ ప్రశంస లందుకుంది. త్వరలో ''భావనా శాకుంతలం'' సంగీత నృత్య నాటకాన్ని, ''పలుకే బంగారమాయె, రాజసూయ యాగం'' నాటకాలను పలుచోట్ల ప్రదర్శించడానికి సన్నాహాలు చేస్తోంది. ఔత్సాహిక గాయనీ గాయకులను సినిమా రంగానికి పరిచయం గావించే నిమిత్తం త్వరలోనే లలిత సంగీత పోటీలను నిర్వహించబోతోంది కూడా.





'పాలు-నీళ్లు'లో జయప్రద, మోహన్‌బాబు

బాబీ జాలిగా చూస్తూ, ''అంకుల్, వాట్ డిడ్ మమ్మీ సే?'' అని అడిగాడు అమాయకంగా. దాంతో మేరీకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. తన బిడ్డలను కౌగలించుకుంది.

ఈ షాట్ ఓ – కే అయ్యాక డైరెక్టర్ బాపయ్య ''ఈ మేరీ ఆ తర్వాత భర్త సమాధి ముందు నిలుచొని, అతన్ని చంపిన వాళ్ళమీద పగ తీర్చుకునే గుండె బలాన్ని తనకివ్వమని, తన జీవితానికి మిగిలిన ఆ చివరి కోరిక తీరేలా దీవించమని ప్రార్థిస్తుంది. ఇంతలో ఆమె బిడ్డలను ఒక దుర్మార్గుడు అపహరించుకుపోతాడు,'' అని తెలిపారు.

కృష్ణంరాజు హీరోగా డి. రామానాయుడు నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ ''అగ్నిపూలు'' చిత్రం త్వరలో విడుదలవుతుంది.

# ఆకాశంలో అరుణకాంతుల రేఖలు. శతకోటి కంఠాల శ్రద్ధాంజలులు.

భారతదేశంలో ఎన్ని తరహాల ప్రజలు ఉన్నారో ఆరాధన కూడా అన్ని రూపాలు దాల్చింది. నృత్యంగా, సంగీతంగా, పురాతన కట్టడాల పైన సజీవ శిల్పాలుగా పూలతో పూజగా పరిమళ దీప ధూప నైవేద్యంగా. ప్రమిదలలోని మిణుకుమిణుకు దీపాలుగా



**అకుంఠిత భక్తి వెల్లువ.**

కాశ్మీర్‌లోని హిమవన్నగ శిఖరాలపైన అమరనాథ్‌లోని మంచు శివలింగంనుంచి, మదురైలోని వెయ్యిస్తంభాల మీనాక్షి దేవాలయం వరకు సోమ్‌నాథ్‌లోని ఇతిహాస దేవాలయాలనుంచి, ఒకప్పుడు 7000 ఆలయాలుగల భువనేశ్వర్‌లోని ఇప్పటి 500 దేవాలయాల వరకు

భారతదేశంలో ప్రతిచోట కూడా, భగవంతునిపట్ల అచంచల విశ్వాసానికి ప్రతీకలు కనబడతాయి

**బుద్ధ భగవానుని అడుగు జాడలలో**

స్థూపాలు, బౌద్ధ విహారాలు, గుహాలయాలు జ్ఞానోదయం పొందిన తథాగతుని పవిత్ర సందేశాన్ని ప్రచారం చేస్తాయి బుద్ధగయలోని బోధివృక్షం అజంతాలోని దేవతామూర్తులు సాంచీలోని స్థూపం లదాక్‌లో సాయంవేళల చల్లటి గాలిలో ప్రార్థనా పతాకాలు రెపరెపలాడతాయి

**గురువు చూపిన సన్మార్గంలో**

దేశమంతటా బొట్టులు పెట్టినట్లు గురుద్వారాలు కనబడతాయి—ఆత్మాభిమానంతో, ఉత్సాహంతో నిండిన శిష్యులను గురువులు చూపించిన సన్మార్గంలోకి ఆహ్వానిస్తూ ఉంటాయి అమృతసర్‌లోని సువర్ణ దేవాలయం కానివ్వండి, పువ్వుల లోయకు సమీపంలో, మారుమూల మంచు శిఖరాలలోని హేమ్‌కుండ్ సాహిబ్ కానివ్వండి!

**అనుయాయులకు ప్రవక్త పిలుపు**

ఎత్తయిన మినార్ నుంచి మతగురువు ప్రార్థనాస్వరం ప్రతిధ్వనించటంతో, భక్తిభావంతో వేయి తలలు వంగుతాయి ప్రవక్త అనుయాయులు అజ్మీర్‌లోని దర్గా, ఢిల్లీలోని జుమా మసీదు, ఫతేపూర్ సిక్రీలోని సలీం చిస్తీ సమాధి దగ్గర సజీవ విశ్వాసపు దివ్య కట్టడాలకు చేరతారు

**రక్షకుని బాటలో**

క్రీస్తుశకము 1వ శతాబ్దంలోనే సెయింట్ థామస్, మద్రాసులో, ప్రపంచానికి తొలి చర్చిలను సమర్పించారు అప్పటినుంచి కూడా, విముక్తి అన్వేషణ మార్గంలో ప్రయాణించేవారు, కేరళ, గోవాలలోని ధవళకాంతుల చర్చిలకు చేరుతూనే ఉన్నారు గోవాలోని వెల్హా కేథెడ్రల్ - అక్కడ సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ భౌతిక కాయం పదిలపరచబడింది ఇంకా అనేక వేల గమ్యాలు

**జీవితం పట్ల పవిత్రభావం.**

మహావీరుడు నిరాడంబర జీవిత మార్గాన్ని ఎంచుకున్నారు నాలుగు ప్రాథమిక విశ్వాసాలపై ఆధారపడిన మతాన్ని స్థాపించారు అనేక లక్షలమంది ఆయన బోధనలను పాటిస్తున్నారు ఆయన బోధలు దిల్వారా, మౌంట్ అబు, పాలీతానా రాణక్‌పూర్, కలకత్తాలలోని జైన దేవాలయాలలో పొందుపరచబడ్డాయి

చరిత్ర సరసన విశ్రాంతి తీసుకునేందుకు రండి! అక్కడకు వచ్చాక మీరు, మీ విశ్రాంతి గడువుని పొడిగించుకునేట్టు చేసే ఎన్నో ఆనందాలు



మీరు ఎక్కడ ఉన్నా సరే, ఇండియన్ ఎయిర్‌లైన్స్ సర్వీసులు మీకు అతి సులభంగా లభిస్తాయి 69 కేంద్రాలకు అతి త్వరితంగా, అన్ని సదుపాయాలతో మిమ్మల్ని తన విమానాలలో చేరవేస్తుంది కొద్ది గంటలలోనే మిమ్మల్ని మీ గమ్యానికి చేరుస్తాం

అతి దగ్గరలో ఉన్న మా కార్యాలయాన్ని, లేదా మీ ట్రావెల్ ఏజెంట్‌ని కలుసుకోండి మీ విశ్రాంతి కార్యక్రమాన్ని ఈరోజే నిర్ధారించుకోండి

**పలు ప్రదేశాలకు IA ద్వారా ప్రయాణం చేయండి**

## ఇండియన్ ఎయిర్‌లైన్స్

దక్షిణ ఆసియాలో అతి పెద్ద ప్రాంతీయ విమానయాన సంస్థ

## తీర్థ యాత్రికుల క్షేత్రయాత్ర

CAS-IA 595 4 TEL

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి రుచికి ఎల్లప్పుడూ
## నమ్మవచ్చును

గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

**మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చున రుచి**



# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని తగ్గించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC G.74 TL

# ధర్మపథం

## మానవ ప్రకృతి

- బులుసు వెంకటరమణయ్య

మానవుని ప్రకృతి చాలా విచిత్రమైనది. గృహకలహాలు వచ్చినప్పుడూ, పరిచితులతో మాటా మాటా వచ్చినప్పుడు బాగా తిట్టుకుని శాపనార్థాలు పెట్టుకున్నా— వారికి ఏదయినా అపాయం కలిగితే ఎంతో బాధ పడటం జరుగుతుంది. అలాగే ఎంతో చికాకు కలిగి జీవితంమీద నిస్పృహ కలిగి "చస్తే బాగుండును" అని అనిపించినా— మరి కొంతసేపటికి జీవితాశ కలుగుతూవే ఉంటుంది. అందువల్ల అట్టి అనుచితపు ఆలోచన ఉండకూడదు. అట్టి మాటలూ ఆడకూడదు.

ఒక కట్టెలమ్ముకునేవాడు ప్రతి రోజూ అడవికి పోయి కట్టెలు కొట్టి తెచ్చి అమ్ముకుని కుటుంబాన్ని పోషించుకొనేవాడు. ఏ రోజు సంపాదించిన డబ్బులు ఆ రోజుకే సరిపోయేవి. రెక్కాడితే డొక్కాడేది. ఇట్టి దయనీయ జీవితం అతనిది.

ఒకనాడు ఉదయం అతడు తన పనికి పోవడానికి గడప దిగుతూ ఉండగా అతని భార్య "రేపు పండుగ రోజు. ప్రతి రోజుకన్న కొంత ఎక్కువగా కూరలూ అవీ తయారు చెయ్యాలి. భక్ష్యాలు కూడా వుండాలి. అందువల్ల ఈ దినం ఎక్కువ కట్టెలు కొట్టి తీసుకురావాలి" అని గట్టిగా హెచ్చరించింది. అతడు సమాధానం చెప్పకుండా అడవికి పోయి, మామూలు కంటె ఎక్కువ శ్రమపడి ఎక్కువగా కట్టెలు కొట్టి మోపుకట్టి సాయంకాలం ఇంటికి తిరుగు ముఖం పట్టాడు. మోయలేక మోయలేక ఆ కట్టెల మోపును మోసుకొని వస్తూ వుండగా, అది ఒకచోట తలమీద నుంచి జారిపోయి కింద పడిపోయింది. పగలల్లా పడిన శ్రమవల్ల అతనికి నిస్త్రాణ కలిగింది. శక్తి తగ్గిపోయింది. ఎంత ప్రయత్నించినా ఆ కట్టెలమోపును ఎత్తి తలపైని పెట్టుకోలేక పోయాడు. అతడు నిట్టూర్పు విడుస్తూ "జీవితం దుర్భరంగా ఉన్నది. ఓ మృత్యు దేవతా! ఎంత ప్రార్థించినా నీకు దయ రాకున్నది" అంటూ వాపోయాడు.

మృత్యు దేవత వానికి ప్రత్యక్షమయ్యెను. ఆ దేవతను చూడగానే భయము జనించెను. బుద్ధి మారిపోయి జీవితము పయి ఆశ కలిగెను. ఆ దేవత తన్ను చంపవచ్చినదని గ్రహించి అతడు నమస్కరించి "నన్ను చంపవలెనని కోరి నిన్ను ధ్యానింప లేదు. నాకు సహాయము చేయవలెనని కోరినాను బరువుగా ఉన్న ఈ కట్టెల మోపును నేను ఎత్తలేకున్నాను. నీవు నాకు సాయపడి దీనిని ఎత్తవలెనని కోరి నిన్ను ధ్యానించాను. నాకీ ఉపకారం చేసిపెట్టు" అని అతి తెలివిగా ఆ మృత్యుదేవతతో అన్నాడు.

ఆ మాటలకు ఆశ్చర్యపడి మృత్యు దేవత ముక్కుమీద వేలు వేసుకొన్నది.

ఆ కట్టెలవాడు కొంచెం సేపు విశ్రాంతి తీసుకుని తర్వాత లేని బలం తెచ్చుకొని ఎలాగో తలపైకి ఎక్కించుకుని కాళ్ళీడ్చు కుంటూ చాలా ఆలస్యంగా ఇలు చేరుకున్నాడు. ఎంత శ్రమకయినా సహించాడు కాని, ప్రాణాలు పోతే బాగుండునని అనుకోలేదు.

కష్టం కలిగేటప్పుడు నిరాశ కలగడం మానవులకు సహజం. అట్టి స్థితిలో నిరాశను వృద్ధి పొందించే ఆలోచనలు కాని, పలుకులు కాని ఉపయోగకరమైనవి కావు. ధైర్యంతో క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవడమే సముచితం.

## పుష్కర కన్య

[18వ పేజీ తరువాయి]

"ఆ ఏమీలేదు. నీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి. నిన్ను పుష్కర స్నానఘట్టం నుంచి రాము తీసుకువచ్చాడు. వాడు నాకు ప్రాణ స్నేహితుడు, కాని నీకు తగినవాడు కాదు. ఆ మధ్య ఒక అమ్మాయి అతనితో స్నేహం చేసి అతను సంసారానికి పనికిరాడని వదిలేసింది. అదీ సంగతి— యిక నీ యిష్టం" అన్నాడు సోము.

"పోనీలెండి ఎవరికర్మ ఎలావుందో" అంది మూల్గినట్టు.

"ఎందుకు అలా సరిపెట్టుకోవటం, నేను ఆదర్శవివాహం చేసుకోదలచాను. నీ అందం, నీ చందం నన్ను ఆకర్షించాయి. నీవు ఒప్పుకుంటే, మనం యిద్దరం పెండ్లి చేసుకుందాం. నీవు ఒప్పుకోకపోయినా నిన్ను వదల లేను, ఆలోచించుకో" సోము తన అభిమతం బెదిరించినట్టు చెప్పాడు.

"ఆడదాన్ని, మీరు అలా అనటం భావ్యం కాదు. ఆడదానికి ఒకసారే మనువండీ. అది నాకు తప్పిపోయింది. తరువాత రామూ నేను పెండ్లి చేసుకుందామనుకున్నాము. ఇప్పుడు యిక మనస్సు మార్చుకోలేను. మేమిద్దరం కనకదుర్గాలయానికి కూడా వెళ్ళి వచ్చాము" రాణి తన అభిప్రాయం ఖచ్చితంగా చెప్పింది.

"అంత చాదస్తం పనికిరాదు రాణీ" సోము అన్నాడు ఆవేశంగా.

"మరి రాము నా నగలు, డబ్బు మా వాళ్ళకిచ్చేదాం అంటున్నారు. మీరు చాలా కట్నంఆశిస్తున్నారు. అదెలా గండీ" అనుమానం వ్యక్తం చేసింది.

"వాడి మొహం వాడొక మూర్ఖుడు. నీవు మనస్సు మార్చుకో. మరల వస్తాను. యిది రహస్యంగా వుంచు" సోము ఆశగా చూపి వెళ్ళిపోయాడు.

ఒకరోజు రాణి రహస్యంగా భీమేశ్వర రావుకి ఒక చిన్న చీటీ పంపింది. అందులో యిలా వుంది—

"మీరు, రాము లేనప్పుడు, సోము వచ్చి తనను పెండ్లి చేసుకోమని నన్ను అడుగుచున్నాడు. రామూని ప్రేమించిన నేను, మరొకరిని ప్రేమించలేను. నా శ్రేయోభిలాషిగా మీరు సోముని మందలించి, రామూ గారిని నా వానిగా చేయాలని మిమ్ములను ప్రార్థిస్తున్నాను."

అది అదునుగా తీసుకొని రామూకి, సోమూకి విరోధం పెట్టాడు భీము! ఆ చీటీ రామూకి చూపించటంతో రామూ కోపంతో కుమిలిపోయాడు.

"నాతో డైరెక్టుగా చెప్పకుండా భీముతో మంతనాలు ఏమిటి?" రామూ రాణిమీద అక్కసు పెంచుకున్నాడు.

# భద్రత అన్నది కేవలం ఒకే తాళంపై ఆధారపడినప్పుడు ఉన్నది ఒక్కటే తాళం, అదే...

## నవ-తాళ్




అవును గోద్రెజ్ 'నవ-తాళ్' ఇతర మామూలు తాళాల కన్నా కాస్త ఎక్కువ ఖరీదే, అయితే మీ భద్రతకు పూర్తిగా నమ్మదగ్గ ఒక తాళంపై కొంచెం ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టడము వివేకం. చూసేందుకు ఇతర తాళాలు 'నవ-తాళ్' లా కనిపించవచ్చు కాని పనితనం నాణ్యత విషయంలో అవి దీని ఛాయకు కూడ చేరలేవు.

విరగని తీరులో యాంత్రిక శక్తితో ఇది తయారుచేయబడింది. అందుచే 'నవ-తాళ్' కేవలం దాని యొక్క తాళం చెవితోనే తీయుట సాధ్యం.

ఇత్తడితో పోత పోయబడి అధిక దృఢత్వం కోసం 'రివెట్లు' లేకుండా ద్విగుణీకృతమైన 'కేసింగు' కలది. బ్యాంకుల్లో, ఆఫీసుల్లో, దుకాణాల్లో ఫ్యాక్టరీలలో, గిడ్డంగులలో యిళ్ళల్లో ఎక్కడ భద్రత అవసరమో అక్కడ 'నవ-తాళ్' భద్రత నిస్తుంది. తాళాలు చేయుటంలో 80 సంవత్సరముల పైగా అనుభవం గల గోద్రెజ్ వారిచే తయారుచేయబడింది ఇది. దేశం అంతట్లోనూ అత్యధికంగా అమ్ముడయ్యే తాళం "గోద్రెజ్ నవ-తాళ్" అవటంలో ఆశ్చర్యం ఏముంది.

నాలుగు సైజుల్లో దొరుకును:

| | |
|---|---|
| 40 మి.మీ | 5 లివర్లు |
| 50 మి మీ | 6 లివర్లు |
| 65 మి మీ | 7 లివర్లు |
| 85 మి.మీ | 8 లివర్లు |

గోద్రెజ్ Godrej

ULKA-NT 1/80 TEL

ఒకరోజు మధ్యాహ్నం ఆఫీసు నుండి ఒంటరిగా వచ్చి భీము, రాణి గదిలోకి వెళ్ళి బలవంతంగా ఆమెను పట్టుకున్నాడు. ఆమె వదిలించుకోవటానికి ప్రయత్నించింది. అప్పటికే ఆమెను మంచంమీదికి త్రోసి మొహం మీద మొహం పెట్టాడు భీము కామా వేశంతో!

"మంచివారని చేరదీస్తే యిదా మీరు చేసేది" పమిట సర్దుకుంటూ అంది రాణి.

"అసలు విషయం చెబుతాను విను! మనం యిద్దరం పెండ్లి చేసుకుందాం. నీ వంటే నాకు ప్రేమ" అన్నాడు భీము

"అదేలాగండీ! రాముగారు, నేను ప్రేమించుకున్నాం కదా" అంది రాణి

"వాడిబొంద. వాడొక వెదవ. సోముగాడు ఒక పిసినారిగాడు. వాళ్ళు యిద్దరు ఎందుకు? మనం తగిన జంట" ఆమె ముంగురులను సవరించాడు భీము

"మనం యిద్దరం పెండ్లి చేసుకుంటే మరి మీ మేనమామగారి అమ్మాయి సంగతేమిటి" రాణి అడిగింది

"అదీ వుంటుంది మనతోనే! లేకపోతే మరోచోట పెడదాం. నీ బంగారం, నీ డబ్బు చాలు మనకి" విశ్వేశ్వరరావు అసలు అతని అభిమతం చెప్పాడు

"అంటే నా ఆస్తి అదీ చూసి మీరు ప్రేమించిన మేనమామ కూతురిని ఒదులుతారా? మాలో ఎవరినో ఒకరిని ఉంపుడు గత్తెగా వుంచ దలుచుకున్నారన్న మాట" భయాన్ని వ్యక్తం చేసింది రాణి

"ఆ అనవసర ప్రసంగం మాని, మన పెండ్లి విషయం ఆలోచించు. మళ్ళీ వస్తాను"

## కత్తుల బోను

బూమ్మీద పడగానే
మెరిసే కత్తితో
బొడ్డు పేగును కోసి
తల్లినీ పిల్లనూ దూరంచేసే
ఈ లోకం కత్తులబోను
అమ్మ కడుపులోనే
అమృత లోకం.

— యం. జ్ఞానసుందర్రావ్

## పుష్కర కన్య

అల్టిమేటంయిచ్చి భీము వెళి పోయాడు.

"అయినా నేను అంత తేలిగ్గా మనస్సు మార్చుకోలేనండీ" ఏడ్పు మొహంతో అంది రాణి, అతను వెళ్ళిపోబోయే ముందు.

ఒక సాయంత్రం ముగ్గురు వచ్చేసరికి యింటి తలుపులు అన్నీ తీసి వున్నాయి రాణి లేదు. ఆతురతతో అంతా వెతికారు. వారికి రాణి నగలపెట్టె తప్ప ఏమీ కనిపించలేదు. వెంటనే ఎవరి పెట్టెలు వారు వెదుక్కున్నారు.

రాము మాత్రం కుర్చీలో కూలబడి, రాణి అలా ఎందుకు చేసిందో ఆలోచించసాగాడు.

ఇంతలో సోము, భీము కంగారుగా రాము దగ్గరకు వచ్చి సోముది నాల్గు వేలు పోయినట్టు, భీముని ఎనిమిది వేలు పోయినట్టు రాముతో చెప్పి గొల్లుమన్నారు.

అంతకు ముందు రాణి అడ్రసు తెలుసుకొని ఆమె నగలు ఆమెకు చేర్చాలని రాము పట్టుపట్టాడు. వారిద్దరు అలా వద్దు అమ్మేదామన్నారు. ఆ గొడవ గొడవగా వుండగానే వారి వస్తువులు వెదకసాగారు.

ఇప్పుడు ఆ నగలు అమ్మి సోము, భీము తమవి పోయిన సొమ్ము రాబట్టుకోవాలను కున్నారు

చేసేదిలేక, మిగిలిన సొమ్ము రాణికి పంపుదామని రాము కూడా అంగీకరించాడు.

రాము, సోము, భీము ఒక నగల వర్తకుని దగ్గరకు తీసుకుని వెళ్ళారు నగలు.

ఆ వర్తకుడు నగలు చూసి వీళ్ళవంక అనుమానంగా చూడసాగాడు.

"ఏమిటండీ! అలా చూస్తారేం? తొందరగా కానీయండి" అన్నాడు భీము సహనం కోల్పోయి.

"ఏమిటయ్యా యిచ్చేది? పెద్దమనుషులు లాగా ప్రవర్తిస్తూ యీ గిల్టు నగలు అమ్మజూపుతున్నారు మిమ్మల్ని ముగ్గురిని పోలీసులకి పట్టిస్తాను" నగల వ్యాపారి గొంతు చించుకొని అరవసాగాడు.

"పరేలేవయ్యా తెలియక తెచ్చాం" ఒకరి మొహం ఒకరు చూసుకొని యింటికి తిరిగి వచ్చారు ముగ్గురూ.

విచారంగా కూర్చున్న వారి దృష్టిని వార్తాపత్రికలోని ఒక వార్త ఆకర్షించింది.

"నిరుద్యోగంతో క్రుంగిపోయిన ఒక యువతి, ఆత్మహత్య చేసుకుంటున్నట్టు, నటించి చాలామంది యువకులను మోసం చేస్తున్నట్టు తెలిసింది. పెద్ద కుటుంబాన్ని పోషించే బాధ్యతవల్ల ఆమె ఎన్నోవుద్యోగాలకు ప్రయత్నించి విఫలమయినట్టు, కొందరు ఆమెను పర్సనల్ సెక్రటరీగా పెట్టుకొని కామవాంఛలు తీర్చుకొని వదిలివేసినట్టు, మరికొందరు ఆమెను మోసం చేసి మధ్యలో వదిలివేసినట్టు చెప్పబడుతూంది. అందువల్ల ఆ యువతి సంఘం చేసిన అన్యాయానికి, సంఘంపైన పగ తీర్చుకుంటున్నట్టు ఆమె ప్రవర్తన వల్ల తెలుస్తున్నది. పుష్కర సంవత్సరంలో ఈ పుష్కర కన్య వలలో పడకుండా యువకులను పోలీసులు హెచ్చరిస్తున్నారు!"

పుష్కరకన్య వలలో పడకుండా పోలీసులు యువకులను హెచ్చరిస్తున్నారనే లైను ముగ్గురు మరొక్కసారి చదువుకుని కుర్చీలలో కూలబడి పోయారు.



# ఒకటోరకంగా అమ్ముడు అవుతూంది ఒక్క 2 ఏళ్ళలోనే

# JOHNSON®

# మిక్సర్-గ్రైండరు

జాన్‌సన్ వారి అత్యుత్తమ పరికరము. భారతదేశంలో గృహోపకరణాల తయారీలో 25 సంవత్సరాల అనుభవము. జాన్‌సన్ మిక్సర్ గ్రైండరు. ఇది ప్రవేశపెట్టిన ఒక్క రెండు సంవత్సరాలలోనే నిస్సందేహంగా మంచి విశిష్టమైన బ్రాండు అని సుప్రసిద్ధమైన కీర్తిని పొందినది

**ఎందుకంటే చూడండి:**

ఉచితము అదనంగా ఎవర్‌సిల్వర్ డబర డ్రైగ్రైండింగుకి ప్రత్యేకంగా వేరే ఎవర్‌సిల్వరు డబర వుండటంచేత మీ మిల్కు షేకులకు మసాలావాసనలు రుచులు అంటుతాయనే భయముండదు





### ఎక్కువ ఆరోగ్యకరము

సులభంగా విడదీసి కడుగుకోడానికి వీలుగా అన్ని తయారుకావింప బడ్డాయి లోపల ఆహారపదార్థాలు అసలు అంటుకుంటాయనే భయముండదు

### సమగ్ర భద్రత

రెండు డబరలలోనూ కూడా బ్లేడులు దిట్టంగా అమర్చబడ్డాయి. తిరుగుతున్నప్పుడు బ్లేడులు విరిగి చెదిరిపోతాయనేదేవుండదు.





### హెవీడ్యూటీ పనితనము

అధికంగా బలిష్టమైన 450 వాట్లు మోటారు. భారతదేశపు వంటకాలకు ప్రత్యేకంగా డిజైనుకావింపబడింది. 45 నిమిషాలు ఆగకుండా పనిచేస్తుంది.

### ఇతర ప్రత్యేక లక్షణాలు

- ప్రత్యేకమైన వెంటిలేషనువల్ల మోటారు ఎప్పుడూ చల్లగావుంటుంది
- బాగా శక్తివంతంగా మిక్సింగ్‌కుగాని గ్రైండింగుకిగాని ప్రత్యేకంగా అభివృద్ధి పరచబడిన బ్లేడులు
- ఒకస్పీడు నుంచి మరో స్పీడుకి కష్టంలేకుండా మార్చుకోడానికి ఇన్‌డర్‌స్విచ్
- హామీ 12 మాసాలు



**JOHNSON**

**శక్తికి పనితనానికికూడా ఒకటోరకము**

తెలంగాణా & రాయలసీమకు డిస్ట్రిబ్యూటర్లు :

మెస్సర్స్. అపర్ సేల్స్, 3-2-848/1/4 to 6. టూరిస్ట్‌హోమ్ ఎదుట, స్టేషన్‌రోడ్, కాచిగూడ, హైదరాబాద్-500027.

కోస్తా ఆంధ్రాకు డిస్ట్రిబ్యూటర్లు :

మెస్సర్స్. సోనోవిజన్ ఎంటర్‌ప్రైజెస్, ఏలూరురోడ్, విజయవాడ-520 002. ఫోన్ : 74216.

## బంగీలో బూడిద !

సేలంలోని బర్న్ అండ్ కంపెనీలో వో పెద్ద పదవిలో వున్న రాజా అనే ఆయన కొడుకు 11 ఏళ్ల అరుణగాణ్ణి ఎవరో ఎత్తుకుపోయారట. పోలీసులు తీవ్రంగా యీ విషయంలో జోక్యం కలుగ చేసుకుని పరిశోధిస్తున్న సమయంలో రాజాగారికో పార్శిలు పోస్టులో వచ్చిందట ఆ పార్శిలులో వో వుత్తరంతో పాటు కొంత బూడిద వున్నదట. ఆ వుత్తరంలో మేమెత్తుకుపోయిన అరుణ్ణిగాణ్ణి చంపి, తగుల బెట్టేసి బూడిద పంపుతున్నాము దాచుకోండి అని వున్నదట. నిజంగా ఆ కుర్రాడిని చంపి బూడిద చేశారా, లేక ప్రతీకారం ఏమైనా తీర్చుకోవాలని యిలా ఆ దుర్మార్గులు రాశారా, అసలా కుర్రాడి తండ్రికి విరోధులెవరైనా వున్నారా అనేదాని పోలీసులు తమ పరిశోధన వింకా తీవ్రం చేశారట.



## నగలకోసం నిలువునా 'హత్య!'

తమిళనాడు కృష్ణగిరికి చెందిన కావేరీ పట్టణంలో 26 ఏళ్ల వేడియప్పన్ అనే అతను తల్లిదండ్రుల యిష్టానికి వ్యతిరేకంగా ఆరేళ్ల క్రితం చంద్ర అనే అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడట ఆనక భార్యాభర్తలకు పోట్లాటలు వచ్చి అవి తీవ్ర స్థాయికి వెళ్ళేసరికి వేడియప్పన్‌కు ఒళ్లు వేడెక్కిపోయి, చంద్రను తీసుకెళ్లి ఆమె పుట్టింట్లో దింపేశాడట. దాంతో ఆమె కోపం వచ్చి భరణం కోసం కోర్టులో దావా వేసేసరికి వేడియప్పన్ వచ్చి నిన్నేలుకుంటూ, నాతో రా అని కేసు ఆపు చేయించి ఆమెను యింటికి తీసుకు వెళ్లాడట. ఆ రావడంలో ఆమె తన నగలేవీ తీసుక రాలేదట. ఏమయ్యాయని అడిగితే మా నాన్న తాకట్టెట్టాడు అందట. ఆ మాటకు కోపం వచ్చిన వేడియప్పన్ ఆమెను వీధిలోకి నెట్టేసి, మీద కిరసనాయిలు పోసి నిప్పంటించి నిలువునా చంపేశాడట.

## కట్నం సబ్సిడీ!

మిడిల్ యీస్ట్ దేశాలలో కట్నాల బాధ పడలేని పెళ్ళికొడుకులు బయట దేశాల అమ్మాయిలను చేసుకుంటున్నారట. అబూ, దుబాయి, కువైట్ వంటి ప్రాంతాలలో వో మాదిరి ధనవంతుని కూతుర్నిచేసుకోవాలంటే మూడులక్షల యిరవై వేల వరకూ కట్నం పొయ్యాలట ఏరీ ధనవంతని కూతుర్ని చేసుకోవాలంటే ఇరవై లక్షలకు పైగా కట్నాలట. ఈ కట్నాల కారణంగా యువకులంతా పై దేశాల పిల్లలను చేసుకుంటున్నారని చింతించిన ప్రభుత్వం యీ కట్నాలకు తట్టుకోలేని యువకులకు సబ్సిడీ యివ్వ నిశ్చయించిందట. కువైట్‌లో యీ రకం ఏర్పాటు వుండనే వున్నదట. అబూధాబిలో యువకులకు వివాహ సందర్భ కట్న నిమిత్తం లక్ష పది వేల వరకూ సహాయము చేయ అక్కడి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నదట— అయ్యో! మనం అబూధాబిలోనైనా ఆడపిల్లల్ని కన్నాం కాదు!

## వడ్డీ వ్యాపారం చెయ్యకండి !

బీహారుకు చెందిన 55 ఏళ్ల మునియమ్మ చాలా ధనవంతురాలుట. వడ్డీ వ్యాపారంతో తన కున్నది గుణించిందట. ఆమెకు 52 ఏళ్ల రామయ్య అనే తమ్ముడు తప్ప యింకెవరు లేరట. ఈ రామయ్య అక్క సొత్తు తదనంతరం తనపేర వ్రాయమని రోజూ అడిగేవాడట. ఆమె నేను అప్పుడే చావను అంటూండేదట. మొన్న రెండో తారీఖున ఆమె జక్కేరిలో తన పొలాలు చూసు కోడానికి వెళ్లి, అక్కడి హనుమంతుని గుడికి వెళ్తే రామయ్య అక్కడ ఆమెను కొడవలితో నరికి చంపేశాడట.

## ప్రమాణస్వీకార ప్రమాణాలు !

అమెరికా ప్రెసిడెంటుగా రీగన్ పదవీ ప్రమాణం చేసే శుభ సమయంలో తగిన బందోబస్తుకో సుమారు ఆరు లక్షల యాభయి వేల మంది సాయుధులను ప్రభుత్వం నియమించిందట. ఇందులో సుమారు రెండు లక్షల మంది బుల్లెట్ ప్రూఫ్ కవచాలు ధరించారట. ఈ పదవిస్వీకరణ మహోత్సవం చూడ వచ్చిన ముఖ్యులలో చాలా మంది కూడా తుపాకి గుళ్ళకు చెక్కు చెదరని కవచాలు ధరించి, పైన మామూలు బట్టలు వేసుకుని వచ్చారట.


1980 SUPER HIT SERIAL
1981 TOP SELLING NOVEL
తెలుగు నవలా సాహిత్యంలో ఇంతవరకు ఏ నవలకూ లేనంతటి పాఠ్యులారిటీ! విడుదలయిన నెలలో మూడు ముద్రణలకు వచ్చిన మేటి నవల!!
యండమూరి వీరేంద్రనాథ్
తులసీదళం ........ రూ.20/-
తులసీదళం బ్లాక్‌మేజిక్ ........ రూ.10/-
యుగాంతం ........ రూ.10/-
రాధ-కుంతి ........ రూ.10/-
ఆఖరి పోరాటం
క్విజ్ సినిమా పోటీ
గడువు 15-3-81
వరకూ నవలా పాఠకుల సౌలభ్యం కోసం పొడిగించబడింది
నవభారత్ బుక్ హౌస్
ఏలూరురోడ్ * విజయవాడ-2

# కథ కాని కథ

పులిగడ్డ విశ్వనాథరావు




వేసవి సెలవులు ప్రారంభమయ్యాయి.

మెడిసన్ కాలేజీలో చదువుతున్న నా అన్నయ్య వేసవిలో ఇంటికి వచ్చాడు వస్తూనే నా తలమీద మొట్టికాయ మొట్టి, "ఏం చెల్లాయ్! ఈ మధ్యన బాగా బలిశావ్ నీ చేత ఎక్సర్‌సైజ్ చేయిస్తే నేగాని లాభం లేదు. లేకపోతే నిన్ను తెలుగు సినిమావాళ్ళు హీరోయిన్‌గా తన్నుకుపోతారు" అని వేళాకోళం చేశాడు.

"పో అన్నయ్యా! నేనంత లావయ్యానా ఏమిటి?" అన్నాను నేను కాస్త విసుగ్గా.

"ఒరే, రాగానే దాన్నెందుకు ఆటపట్టిస్తున్నావురా?" అని అమ్మ మందలించింది అన్నయ్యని.

దాంతో అన్నయ్య పెరట్లోకి జారుకున్నాడు అన్నయ్య ఉండిండి నన్ను ఏదో మిషపై ఉడికిస్తూనే వుంటాడు. నేను మర్నాడు కాఫీ తయారుచేసి అన్నయ్యకు అందించాను. "చెల్లాయ్, ఇది టీయా లేక కాఫీయా? అన్నట్టు మరిచాను- నువ్వు తయారుచేసిన కాఫీ కాలువ నీళ్ళలాగా, టీ అయితే బట్టలు జాడించిన నీళ్ళలాగా వుంటుంది కదూ? ఇది కాలువనీళ్ళలా వుంది కాబట్టి కాఫీ అయివుండాలి. ఔనా?" అన్నాడు.

"ఐతే నీకు కాలువ నీళ్ళు తాగే అలవాటుంది కాబోలు. లేకపోతే వాటి రుచి ఎట్లా తెలుస్తుంది?"

"మాటలు నేర్చావే!" అన్నాడు నవ్వుతూ అన్నయ్య అన్నయ్యకు నన్ను ఎగతాళి చేయడం సరదా నేనూ అతన్ని ఆటపట్టించాలని నిశ్చయించుకున్నాను చక్కటి అవకాశంకోసం ఎదురుచూస్తున్నాను ఒకరోజు నేను కోరినట్టుగానే అవకాశం చిక్కింది.

అమ్మకు ఆరోజు తెల్లకాగితం అవసరం వచ్చింది. "చూడే, అన్నయ్య కాగితాల్లో ఏదైనా తెల్లకాగితం ఉందేమో" అని నన్ను పురమాయించింది. అన్నయ్య ఇంట్లో లేడు. నేను అన్నయ్య నోట్సు తిరగేయసాగాను ఏదో కాగితం క్రిందపడింది. దానిమీద అన్నయ్య దస్తూరీతో ఏదో వ్రాసి ఉంది "...నిన్ను నేను చాలాకాలంనుండి ఆరాధిస్తున్నాను..." ఇంకింకా ఏదో రాసుంది ఎవరికి రాశాడో తెలియదు ముందు పేజీ లేదు కాబోలు. "అమ్మ దొంగా! పట్టుబడ్డావు" అనుకొని ఆ కాగితాన్ని చాటుగా భద్రపరిచాను ఇంతలో అమ్మ "ఎక్కడున్నావే? అమ్మాయి ఎంత చూసినా ఇంకా తెల్ల కాగితమే దొరకలేదా?" అని కేకేసింది. తొందరగా రెండు తెల్ల కాగితాలు తీసి అమ్మకు ఇచ్చాను.

తర్వాత రహస్యంగా ఆ ఉత్తరం విప్పి చదవసాగాను—

".. నిన్ను నేను చాలా కాలంనుండి ఆరాధిస్తున్నాను. రోజురోజుకూ నీపట్ల నా ప్రేమ పెరిగిపోతూవచ్చింది. నువ్వు క్రిందటి వేసవి సెలవలో నా దగ్గరే ఉన్నావు ..."

అబ్బాయి ప్రేమలో పడ్డాడే. కాని ఆమె ఎవరు? వేసవి సెలవల్లో అతడితో ఉందట. అంటే ఇక్కడే ఈ ఊళ్ళోనే ఉందన్నమాట. ఎవరు చెప్మా?

"నువ్వు నావద్దకు నీ ఇష్టమొచ్చినప్పుడు రమ్మనమన్నాను. నువ్వు ఎప్పుడు వచ్చినా నిన్ను ఆదరించాను"

ఇప్పుడు తెలిసింది నాకు అన్నయ్య క్రిందటి వేసవి సెలవలో తన గదిలో ఏమి చేసేవాడో. గది తలుపులు, కిటికీలో పలనుండి ఇందుకేనా బిగించేవాడు అమ్మకీ నాన్నకీ తెలిస్తే కొంప మునిగిపోదూ

"నీ కౌగిట్లో నేను ఈ ప్రపంచాన్నే మరిచేవాణ్ణి"

ఎవరు చెప్మా ఈమె? పని మనిషి సిన్ని కాదుగదా! కాని అది అన్నయ్యకంటే ఇంకా ఏళ్ళు పెద్దది మనిషి చాలా మంచిదికూడా. నా మనసె త చెడదో పాపం! దాన్ని అనుమానించాను, దానికి అన్నయ్యంతేసి కొడుకు ఉంటేటే! మా ఇంటాయన అమ్మాయి సీత కాదుగదా. అది అలాంటిదే ఏమోమరి, నా స్నేహితురాలు లక్ష్మి అవవచ్చునే.

చదవసాగాను

"ఆ రోజు ఎండ తీవ్రంగా ఉంది. అయినా అగ్జెంటు పని ఉండడం వల్ల నేను డ్రెస్సు అయి బయలుదేరబోయాను. నేను గడప దాటుతుండగా నువ్వు వచ్చి నన్ను అడ్డావు మరి నిన్ను విడిచి నేన ఎక్కడికైనా పోగలనా? నువ్వు ఎప్పుడు వచ్చినా నిన్ను నేను తిరిగి పొమ్మని అనలేదు. ఎలా అనగలను? నువ్వు అలిగితే నేను బ్రతకగలనా"?

ఈమె సీతే అయి వుండాలి లక్ష్మి అలాంటిది కాదు. కాని ఎవరు చెప్పగలరు?

"అప్పుడప్పుడు నిన్ను నావద్ద చూచి నా స్నేహితులు కోపగించుకుని తిరిగి వెళ్ళిపోయేవారు మరేం చేస్తారు? నేను వాళ్ళను ఆ వేళకే ఆహ్వానించేవాణ్ణి కదా! అయినా, నువ్వు నా గదిలో ఉన్నా, వాళ్ళు ఏ జంకూ లేకుండా తలుపు తట్టవచ్చునని, నేను వాళ్ళ కోసం తలుపు తెరుస్తానని ఇదివరకే చెప్పి ఉంచాను."

ఎంత సిగ్గులేని తనం. పాపం! అతని మిత్రులే నయంలా ఉంది.

"నేనలా చెప్పినా వాళ్ళు నవ్వి, ఫరవా లేదులే మరెప్పుడైనా వచ్చి మాట్లాడుతాం" అని అనేవారు

"పాపం! నీ మూలంగా నా స్నేహితులకు ఇబ్బంది కలుగుతూందని నేను బాధపడలేక పోలేదులే' కాని నాకు వాళ్ళకంటె నువ్వు ఎక్కువ కావలసిన దానివి కదా. వాళ్ళు పోతే పోతారులే అని నీ దగ్గరకు చేరేవాణ్ణి. నువ్వు నీ చల్లని పెదవులతో నా కళ్ళను తాకి నన్ను పరవశుణ్ణి చేసే దానివి"

"నిజంగా క్రిందటి వేసవి సెలవలు మనమిద్దరమూ ఎంత హాయిగా గడిపాం. దినాలు క్షణాల్లా గడిచేవి అప్పుడప్పుడు ఒక్కడినీ అలా మామిడి తోటలో షికారుకి పోయేవాణ్ణి. అక్కడ నువ్వు నా కోసం ఎదురు చూస్తూ వుండేదానివి నేను రాగానే చిరునవ్వుతో పలకరించేదానివి మామిడిచెట్ల చల్లటి నీడలో, కోకిల జోలపాట వింటూ మనమిద్దరం ఒకరిలో ఒకరు ఇమిడిపోయే వాళ్ళం"

"ఒకరోజు సాయంత్రం ఒంటరిగా ఊరి చెరువు ఒడ్డుకు వెళ్ళాను చీకటి పడగానే ఆ ప్రదేశం నిర్మానుష్యమయింది నేనూ లేద్దామని అనుకుంటూండగా ఎక్కడినుంచో నువ్వు వచ్చి నన్ను వాటేసుకున్నావు రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చినందుకు నాన్నగారు కళ్ళెర్ర చేశారు."

ఎంత నంగనాచో! అందుకా రాత్రి అన్నయ్య ఆలస్యంగా వస్తూ వుండేవాడు. ఈ విషయం నాన్నకి తెలియజేస్తే సరి. ఇంకా ముందేమి రాశాడో చూద్దాం.

"ఇంటో ఎన్ని చీవాట్లు పడినా నీ సాన్నిధ్యమే నేను కోరేవాణ్ణి. నీ ఒడిలో నేను స్వర్గసుఖం అనుభవించేవాణ్ణి"

"నా స్నేహితుల్లో చాలా మందికి నాలాగే వేసవిలో పనీపాటూ ఉండేది కాదు వాళ్ళు గంటల తరబడి నాతో కూర్చుని గప్పాలు కొట్టేవారు మరి వాళకు మాత్రం మరొక కాలక్షేపం ఉంటేగా! అటువంటి హాస్కుగాళ్ళకు నువ్వు నావద్ద ఉన్నప్పుడు నన్ను డిస్టర్బ్ చెయ్యవద్దని స్పష్టంగా చెప్పేశాను. వాళ్ళు రాగానే నువ్వు ఎన్నోసార్లు అలిగి పారిపోయేదానివి కదా! ఆ ఎడబాటు సహించలేక నా ఆవేశాన్నంతా ఆ స్నేహితులపై ప్రకటించేవాణ్ణి. వాళ్ళు కూడా ఆవేశం చెంది, "అది తప్పక నీ కొంప ముంచుతుందిలే"అనిఅంటూ మాటాడకుండా వెళ్ళిపోయేవారు. ఎంతైనా స్నేహితులు కదా, ఈ విషయం అమ్మకీ, నాన్నకీ చెప్పేవారు కాదు నేను మాత్రం వాళ్ళను ఎప్పుడూ ఖాతరు చేయలేదు. నువ్వంటే నాకు అంత అప్యాయత!"

"ఆ రోజు జరిగిన సంఘటన ఎంత మరవాలనుకున్నా మరవగలనా! ఆ రోజు వాతావరణం చక్కగా వుంది. ఆకాశం రంగు రంగులైన దుస్తులను ధరించి ఉల్లాసంగా అట్టహాసం చేస్తూంది ఆనంద బాష్పాలు కురిపిస్తూంది. ఆమె నవ్వినప్పుడల్లా పళ్ళు ధగధగా మెరిసి భూమిని ప్రకాశవంతం చేస్తున్నాయి. ఈ పిడుగుల్లో, మెరుపుల్లో నువ్వు వచ్చే ఆశలేదు కాబట్టి ఒక పుస్తకం తీసుకుని కుర్చీలో కూర్చున్నా ఎంతసేపు చదివానో నాకే తెలియదు. అప్పుడే నువ్వు నా వెనుకనుంచి వచ్చి నా కళ్ళు మూశావు. పుస్తకం క్రిందపడింది. మనిద్దరం ఒకరి కౌగిట్లో ఒకరు చేరి ఆనంద డోలికల్లో ఊగసాగాం"

"గది తలుపు వేయడం మరిచాం కాబోలు.



వివరో గదిలో ప్రవేశించారు. మరెవరు? నాన్నగారే! ఆ రోజు పెందరాళే ఇంటికి వచ్చేశారు. మన వ్యవహారం చూసి మూడో కన్ను తెరిచారు.''

## క థ కా ని క థ

ఐతే నాన్నగారికి ఈ వ్యవహారం తెలిసిందన్న మాట. మరీ ఈ భోగట్టా ఆయన వివరికీ తెలియజేయలేదేం? అన్నయ్యను బాగా చీవాట్లు పెట్టి, ఆ అమ్మాయిని (సీతే కాబోలు) గెంటేసి ఈ గుట్టు రట్టవకుండా నోరు మూసుకుని ఉంటారు.


# జుట్టుకు సిల్కువంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన షికాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ షికాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది. మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.




## స్వస్తిక్
# షికాకాయ్ సబ్బు

ఇందులో షికాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 26/79 tel

"నువ్వు చదువుకునే నెపంతో నీ గదిలో చేసే పని ఇదటా?' అని కూకలేశారు నాన్నగారు ఇప్పటి నుండే ఈ చెడ్డ అలవాట్లు అలవరుచుకుంటే నేను జీవితంలో బాగుపడినట్లేననీ, డాక్టరు అయినట్లేననీ చివాట్లు పెట్టారు ఇప్పుడు నేను శ్రమపడి బ్రతుకు బాగు చేసుకోవాలనీ, ఏ ఒడుదుడుకులూ లేకుండా చదువు కొనసాగించాలనీ, నా మంచి చెడ్డలు నేనే ఆలోచించుకోవాలనీ, బోధపరిచారు ..."

తర్వాత పేజీలు లేవు. ముందు అన్నయ్యను ఏగతాళి చేద్దామని అనుకున్నాను. కాని ఇప్పుడు అన్నయ్యపై జాలి కలిగింది. పాపం, ఆ అమ్మాయి ఎవరో! అన్నయ్య ఆమెను అంత గాఢంగా ప్రేమించాడు. పోనీ అన్నయ్య చదువు పూర్తి కాగానే ఆ అమ్మాయితో పెళ్ళి చేసేయవచ్చుగా పాపం, ఆ అమ్మాయి ఎంత బాధపడుతూందో! వాళ్ళిద్దరూ కలుసుకునే అవకాశం మాత్రం నాన్నగారు దక్కనిస్తారా? అన్నయ్య ఎంత వ్యథపడుతున్నాడో! ఎవరో ఆ అమ్మాయి! తెలిస్తే బాపుణ్ణి అమ్మనీ, నాన్ననీ ఒప్పించి సంబంధం కుదర్చవచ్చుగా అన్నయ్య చదువు పూర్తవగానే మూడు ముళ్ళూ వేసేయవచ్చు.

ఆరోజు అన్నయ్య కనబడగానే రహస్యంగా ఈ విషయం అడిగాను—

"అన్నయ్యా! ఈ ఉత్తరం చదివాను. ముందు ఆ అమ్మాయి ఎవరో చెప్పు. నేను అమ్మనీ, నాన్ననీ ఒప్పించి ఈ సంబంధం కుదురుస్తాను. నీ చదువు పూర్తవగానే తాళి కట్టేయ్"

అన్నయ్య విరగబడి నవ్వడం చూసి, "ఏమిటి అన్నయ్యా? నేను నీమీద జాలి పడుతూంటే నువ్వు నవ్వుతావు?" అని అడిగాను.

"ఇది కథ చెల్లాయ్! ఇంకా పూర్తిచేయ లేదు."

"అబద్ధం."

"కాని ఇది నా కథే...స్వానుభవమే."

"అయితే ఆ అమ్మాయిపేరు?"

అన్నయ్య చెప్పిన జవాబు విని నిర్ఘాంత పోయాను. అతను మరింత బిగ్గరగా నవ్వుతూ ఇలా అన్నాడు "ఓసి పిచ్చితల్లీ! ఆ అమ్మాయి మరెవరో కాదు, అందరికీ ప్రియమైన — నిద్రాదేవి!"

# హైదరాబాద్ నోట్ బుక్

### అకాడెమీల గ్రాంటు హెచ్చింపు :

రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని అకాడమీలకు ఇచ్చే గ్రాంటులను హెచ్చించినట్లు రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి జనవరి 16న ఒక సమావేశంలో తెలిపారు. ఈ అకాడమీల కన్నిటికీ మొత్తం 12 లక్షలు మాత్రమే గ్రాంటు వుండేది. ఇక మీద మూడింతలకు పైగా అనగా 34 లక్షల 50 వేలకు పెరిగింది. సాహిత్య అకాడమీకి ఇంత వరకు మూడులక్షల రూపాయిలే గ్రాంటు. ఇప్పుడు ఏడు లక్షలకు పెరుగుతుంది లలితకళా అకాడెమీ గ్రాంటు రెండు లక్షల నుంచి ఐదు లక్షలకు పెంచారు. సంగీత నాటక అకాడెమీని సంగీత, నాటక, నృత్య అకాడెమీలుగా విభజిస్తారు మూడింటికి చెరినాలుగు లక్షల రూపాయిలు కేటాయిస్తారు. అంతర్జాతీయ తెలుగు సంస్థ గ్రాంటు మూడు లక్షల నుంచి పదమూడు లక్షలకు పెంచుతారు. సాహిత్య కళారంగాలలో సేవచేసిన వారికి ప్రస్తుతం ఇస్తున్న ఆర్థిక సహాయం వంద రూపాయల్ని నూటయాభైకి పెంచామని కూడా మంత్రి తెలిపారు. వరంగల్లులో పోతన, నెల్లూరులో తిక్కన, రాజమండ్రిలో నన్నయ్య స్మారక చిహ్నాలు నెలకొల్పదలచామని ఆయన తెలిపారు.

### శ్రీ నిష్ఠల వెంకటరావుకు సన్మానం :

హ్యుమానిటేరియన్ అసోసియేషన్, శ్రీనివాస సాహితీ సమితి మున్నగు సాంఘిక సారస్వత సంఘాలతో సంబంధం కలిగిన సంఘసేవకుడు శ్రీ నిష్ఠల వెంకటరావును అతని 27వ జన్మ దినోత్సవం సందర్భంగా పలు సంస్థలు ఫిబ్రవరి 7వ తేదీరాత్రి రిట్జ్ హోటల్ లో సన్మానించాయి. సన్మాన సభకు అధ్యక్షత వహించిన శ్రీ తిరుమల రామచంద్ర, ప్రొఫెసర్ శ్రీ రాం శర్మ, డాక్టర్ ఎం. గోపాల్ రెడ్డి, డాక్టర్ బి. రామరాజు, డాక్టర్ బి. ఆర్. శాస్త్రి, డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, ప్రముఖ మహారాష్ట్ర రచయిత శ్రీ ఆనంద్ సాధలే శ్రీ కృష్ణస్వామి [హ్యుమానిటేరియన్] మున్నగు వారు శ్రీ వెంకటరావు సంఘసేవా తత్పరతను, ఉపకారశీలతను, స్థితప్రజ్ఞతను గురించి పెక్కు సంఘటనలను వివరిస్తూ ప్రసంగించారు.

### ఉగాది ఉత్సవంలో ప్రముఖులకు సన్మానం :

రాష్ట్రావతరణ రజతోత్సవ సంవత్సరమైన ఈ సంవత్సరంలో వచ్చే ఉగాదినాడు వివిధ రంగాలలో ప్రముఖులను రాష్ట్ర ప్రభుత్వం సన్మానిస్తుంది. కన్నడులకు, మహారాష్ట్రులకు కూడా ఉగాదే నూతన సంవత్సరాది గనుక జంట నగరాలలోని కర్ణాటక మహారాష్ట్రులను కూడా సన్మానించ దలచామని సాంస్కృతిక శాఖామంత్రి శ్రీభాట్టం శ్రీరామమూర్తి ఫిబ్రవరి 7న తెలిపారు. ఈ ఉగాది ఉత్సవాల నిర్వహణకు ఏర్పడిన కార్యవర్గానికి ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య ప్రధాన పోషకులు. శ్రీ ప్రభాకరరెడ్డి గౌరవాధ్యక్షులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కార్యనిర్వాహకాధ్యక్షులు. ఉత్సవ నిర్వహణకు వివిధ సంఘాలు ఏర్పడ్డాయి.

### 44 మందితో నూతన మంత్రివర్గం :

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య ఫిబ్రవరి 9వ తేదీన నూతనమంత్రివర్గం ఏర్పాటు చేశారు రెండు నెలల క్రితం 61 మందితో మంత్రివర్గం ఏర్పడడం, అది చాల విస్తృతమైనదని దేశమంతటా విమర్శ పాత్ర కావడం, దాని మీదట శ్రీ అంజయ్య మంత్రివర్గాన్ని పునర్నిర్మించడానికి వీలుగా 60 మంది మంత్రులు రాజీనామా ఇవ్వడం ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు విదితమే. ఇందిరాకాంగ్రెసు అధిష్టాన వర్గంతో సంప్రదించిన మీదట శ్రీ అంజయ్య పాత మంత్రివర్గంలోని 16 మంది మంత్రులను ఉపమంత్రులను వదలిపెట్టి తక్కిన44మందితో నూతన మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు. వదలి పెట్టిన వారిలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి అల్లుడు శ్రీ వల్లా రామభూపాలరెడ్డి ఒకరు. శ్రీ కోన ప్రభాకరరావు విధానసభ స్పీకరుగాను, శ్రీ సయ్యద్ ముకస్సిర్ షా విధాన పరిషత్తు అధ్యక్షుడుగాను ఎన్నికయ్యారు.

### బి జె పి జిల్లా కమిటీలు :

భారతీయ జనతాపార్టీ రాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ బంగారు లక్ష్మణ్ ఫిబ్రవరి 5న పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, తమ పార్టీ రాష్ట్రంలో ఇదివరకు లక్షమందిని సభ్యులుగా చేర్చిందని ఏప్రిల్ లోగా మరి 75వేల మందిని చేరుస్తుందని తెలిపారు. త్వరలోనే అన్ని జిల్లాలలోను పార్టీ సంఘాలు ఏర్పాటుచేస్తామన్నారు అఖిలభారత పార్టీ నాయకులు శ్రీ అటల్ బిహారీ వాజపేయి మున్నగువారు మార్చి నెల నుండి రాష్ట్రంలో పర్యటిస్తారని ఆయన తెలిపారు. తమ పార్టీ సాంస్కృతిక,కర్షక, యువజన విభాగాలను ప్రారంభిస్తుందని ఆయన తెలిపారు.

### ఉపశ్రుతి :

ఇక నాలుగేళ్ళలో 14 లక్షల టెలిఫోన్లు ఏర్పాటు చేస్తామని కేంద్రమంత్రి శ్రీ స్టీఫెన్ తెలిపారు. పత్రిక చూశారా? అని ఒకరు ప్రశ్నించారు నన్ను. అయితే, 14 కోట్ల రాంగ్‌నంబర్లతో మనకు సరికొత్త బాధ అన్నమాట—అని మా సంభాషణ వింటున్న ఒక పెద్దమనిషి విసురు విసిరారు.

— తిరుమల రామచంద్ర

ప్రఖ్యాతి చెందిన!
ఖటావ్ మిల్లు వారి
★ 100% పాలియస్టర్ చీరలు.
★ ఫుల్‌వాయిల్, ఆఫ్ వాయిల్ చీరలు
★ షర్టింగులు, గ్లాసుకో దోవతులు
★ డ్రస్ మెటీరియల్సు, 2x2 రూబియాలాన్సు
★ స్కూలు యూనిఫారంలు .. వగైరాలకు
విజయ షో రూమ్
ప్రత్యేక ఖటావ్ మిల్లు వస్త్రముల షోరూమ్
ఓ.డి. హాస్పటల్ రోడ్డు,
గవర్నరుపేట ...... విజయవాడ-2.



పురుషులకు దీటైన రూపంకోసం
శ్రీశాక
బనియన్లు
డ్రాయర్లు



డీలరు: M/s వెంట్రప్రెగడ హనుమంతరావు,
వుయ్యూరు.





సర్ప [నైట్ పిల్స్]

(మదనకామేశ్వరి గులిగా)

బలక్షీణత, ఒళ్లు బలక్షీణత, నిద్రలేక బాధపడేవారు, చిన్నతనములో తెలియక చేసిన తప్పువల్ల, మానసికంగా బాధపడేవారు, జీవిత సుఖం లేనివారు, పిల్లలు లేనివారు, ఇంక అన్ని బలహీనతలు, మన సిద్ధ వైద్యముతో నయమవుతుంది. వెంటనే, మా సిద్ధ సంజీవి అయిన "సర్ప" వాడండి.

30 మాత్రలు 25-00. * 60 మాత్రలు 40-00

వి.పి.పి ఛార్జి 5-00.★మందు కావలసినవారు ముందు డబ్బు పంపించి మందు పుచ్చుకొనవలయును. 30 మాత్రలకు తక్కువ పంపము.

Karthikeya Vaidyasalai, Palni P.O. Pin 624601. Phone : 606.



కాలము చాలా విలువైనది.

అక్టోబరులో S. S. C, INTER పాసైన విద్యార్థులారా !

1980 అక్టోబరులో S.S.C., INTER పరీక్షలు వ్రాసి పాస్ లేదా ఫెయిలయిన విద్యార్థినీ విద్యార్థులకు ఆంధ్రప్రదేశ్ సాంకేతిక విద్యాశాఖవారు నిర్వహించు అగ్రికల్చర్ పరీక్షకు శిక్షణ ఇవ్వబడుచున్నది శిక్షణపూర్తయిన విద్యార్థులు వివిధ ప్రభుత్వవ్యవసాయ శాఖలలో ఈ క్రింది ఉద్యోగములను పొందవచ్చును. **1. Field Man 2. Field Asst. 3. Sub Asst. 4. Tech. Asst.** హాస్టలు, భోజనవసతులు కల్పించబడును. స్త్రీలకు ప్రత్యేక హాస్టలు కలదు. **Postal** ద్వారా కూడా శిక్షణ ఇవ్వబడును. పై ప్రభుత్వ ఉద్యోగములు చేయుటకై శిక్షణ పొందుటకు చేరదలచిన విద్యార్థినీ విద్యార్థులు అన్ని వివరములకు ఈ క్రింది అడ్రసుకు ఈ ప్రకటన వెలువడిన 10 రోజుల లోగా రూ. 3-50 ఎం.ఒ ద్వారా పంపి అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టసును పొందవచ్చును.

**PRINCIPAL,**
S. V. T. A. T. College, Post Box No. 30
CHILAKALURIPET 522616, Guntur Dt.


# వారఫలం

13-3-1981 శుక్రవారం మొదలు
19-3-1981 గురువారం వరకు

మేషం : అనుకూలదాయకమైన గ్రహస్థితి గలదు. ఆనందదాయకమైన వారం. అప్రయత్న ధనలాభం చేకూరగల వారం. ఆతృతతో పనులకు దిగకండి. అపూర్వ వస్తు సేకరణకు ప్రయత్నించ గలరు. ఉద్యోగంలో, క్రీడావనిలో చాలామందికి అవకాశాలు చేకూరగలవు. స్త్రీలకు : వృత్తి రాణింపు, ఆదాయంలో పెంపుదల సూచించే వారం.

వృషభం: మనస్థిమితము లేకపోవటం, చేసే పనులలో కలిసి రాకపోవటం, అనుకున్న ఆదాయం చేతికందకపోవటం, వ్యాపారం బాగా సాగక పోవటం, పనులలో విలంబన కనిపించటం ఈ వారంలో గమనించగలరు. చాలమందికి రాజకీయంగా కొంత అనుకూలత సంభవం స్త్రీలకు: కళా సాహిత్య రంగాలలో అవకాశాలుంటాయి. కాని వినియోగించుకొనే అవకాశం లేకపోవటం గమనించగలరు.

మిథునం: ఆరోగ్యం మెరుగవుతుంది. అనుకూల పరిస్థితులు, వ్యాపార ఉద్యోగ రంగాలలో కనిపిస్తాయి నూతన నోద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. కృషిచేయండి భూ, గృహముల నుండి ఆదాయం ఆశించదగిన సమయం. స్త్రీలకు : కుటుంబానందం, ఇంట శుభకార్యాలోచనలుండవచ్చు. క్రీడారంగావకాశాలుంటాయి. వినియోగించుకోండి.

కర్కాటకం : మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారం సాఫీగా సాగిపోతుంది. ఉత్తరాల మూలాన ముఖ్య విషయాలు గ్రహించి ఆదాయం సాధించే మార్గమాలోచించగలరు సాహిత్య రంగంలో అవకాశాలుండటం, డబ్బు చేతికి అందటం, మాటకు విలువ పెరగటం, గౌరవపదవులు చేపట్టటం జరుగుతుంది. స్త్రీలకు .విద్యారంగంలో నూతనావకాశాలు, విజయ సూచన సంభవం.

సింహం విలువగల వస్తువులు కొంటారు. నూతన విషయాలు తెలిసికొంటారు. బంధువర్గీయులవలన మేలుపొందనున్నారు. మిత్రసహాయ సంపత్తులు గలవు. ఒకానొక విషయం నెరవేర గలదన్నది అనుకూలంగా ముగియదు. స్త్రీలకు: సంతానం మూలంగా పెంపు, ఉత్సాహం, ఒక వేళ లాభం పొందగల్గటం సంభవం. ఆరోగ్య లోపంలేదు.

కన్య : క్రీడారంగావకాశాలు చాలమంది విషయంలో చెప్పదగిన గ్రహస్థితి గలదు. రాజకీయ్యవాదులకు ఆటంకాలు తొలగి, సర్వానుకూలత సంభవించేవారం. అయినవారికో, పరులకో, సహాయం చేయవలసి రావటం, ఎలాగైనా కొంత ధన సహాయం చేయక తప్పకపోవటం గమనించగలరు. ఉద్యోగంలో ఎంతో శ్రద్ధాసక్తులు చూపవలసిన కాలం. స్త్రీలకు . సాహిత్య కళారంగాలలో అను

# అపూర్వమైన సువాసన...
# పుష్కలమైన నురుగు...



## మీకే తెలుస్తుంది, యిది
## అత్యుత్తమ* నాణ్యమైనదని.




సూపర్ పవర్

**చెక్***

డిటర్జెంట్ బిళ్ళ




| | |
|---|---|
| మామూలు ధర | రూ 2.38* |
| చెక్ ప్రత్యేక ధర | రూ. 1.88* |

ఈ తగ్గింపు ప్రతి కొనుగోలుకు 6 సబ్బుల వరకు మాత్రమే పరిమితం.

అపూర్వమైన తాజా నిమ్మ సువాసన, దీనిని స్నానానికి వుపయోగించుదామా అనే కోరిక మీకు కలుగ చేస్తుంది.

చెక్ యొక్క పుష్కలమైన నురుగు మీ బట్టలను ఎంతో తెల్లగాను, మరియు ఎంతో ప్రకాశవంతముగాను చేస్తుంది.



ఇది గ్యారంటీ యివ్వబడిన అత్యుత్తమ నాణ్యతకు చిహ్నం. డిటర్జెంట్ బిళ్ళ కొనే ప్రతిసారి మీరు యీ చిహ్నంకోసం చూడండి.

*పూర్తిగా తృప్తి కలుగనిచో సబ్బును తిరిగియిచ్చి సొమ్మును వాపసు పొందండి

**చెక్ తో ఉతకండి, తేడా చెక్ చేయండి**

* స్థానిక పన్నులు అదనం.

**దీర్ఘవ్యాధులకు ఉత్తమవైద్యం**

దురభ్యాసములకు లోనై, దాంపత్యసౌఖ్యంపొందలేనివారికి హెర్నియా, చర్మవ్యాధులకు పోషుద్వారా వరిబీజం(బుడ్డ) ఇస్నోఫిలియా, ఉబ్బసం (దమ్ము) జీర్ణాశయ(గ్యాస్ట్రిక్)మూత్ర,స్త్రీల వ్యాధులకు ఆపరేషన్ లేకుండా చికిత్స చేయబడును. -రండి

**డా॥ దేవర**

5/1 బ్రాడీపేట, గుంటూరు. A.P.




'అనేక యోగ్యతా పత్రములు పొందిన దివ్యౌషధం'

# బైద్యనాథ్

శ్రీ బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ లిమిటెడ్ 60 సం॥ల క్రితం స్థాపించబడి దేశవిదేశాలలో ఆయుర్వేద ఔషధములు తయారుచేయు పెద్ద సంస్థగా ప్రఖ్యాతి గాంచినది.




ప్రాచీన ఆయుర్వేద గ్రంధముల ననుసరించి 700 రకముల ఆయుర్వేద ఔషధములు కలకత్తా, పాట్నా, ఝాన్సీ, అలహాబాద్ మరియు నాగపూరులలోని 5 కర్మాగార ములలో అత్యంత అధునాతన పద్ధతిలో బైద్యనాధ్ చే తయారుచేయబడు చున్నవి.

బైద్యనాథ్ ఔషధాలు 800 విక్రయశాలలు మరియు 60,000 ఏజన్సీలు మరియు ఔషధ విక్రేతలద్వారా భారతదేశ మంతటా లభించుచున్నవి.



మీ కుటుంబ ఆరోగ్యమునకు
బైద్యనాథ ఔషధములయందు విశ్వాసముంచండి.

INTERMARK/ SBAB/ 16

బైద్యనాథ్: ఆయుర్వేద శాస్త్ర ప్రామాణికతకు మారుపేరు

విక్రయశాలలు ఆంధ్రప్రదేశ్ : 21-7-802, హైకోర్టు ఎదుట, హైదరాబాద్-2.


# వారఫలం

కూలత, కొందరకు నూతన నోద్యోగాలు ఎలాగైనా సంప్రాప్తించడం గమనింపదగిన వారం.

తుల: ఇప్పటికే అధిక వ్యయంతో సతమతమవు తుంటే, వ్యయరాశి స్థితి శని, గురువుల వలన, మరీ వ్యయం చేయవలసి రావటం, అందులకై సంకటపడటం గమనించగలరు. అందుకుతోడు ఆరోగ్యం భంగం కావటం గమనించాలి. జాగరూకత వహించాలి. ఉద్యోగంలో ఎంత శ్రద్ధ చూపితే అంత మంచిది. స్త్రీలకు : రాజకీయ రంగంలో, సంఘంలో, సాహిత్యరంగంలో అవకాశాలుండ గలవు.

వృశ్చికం: చాలమందికి రాబడిని మించిన వ్యయం సూచింపబడే వారం. రావలసిన ధనం సమయానికి చేతికందకపోవటం గమనించగలరు. వైద్య వృత్తి లోనివారికి, న్యాయవాదులకు, నటకులకు, చిత్ర రంగానుభవం గల వారికి సదవకాశాలుండగలవు. రాజకీయంగా చాలమందికి అనుకూలం. ప్రారం భించిన వ్యాపారంలో ప్రగతిని గమనింపగలరు. స్త్రీలకు : వృత్తిలో అనుకూలం, ధనాదాయం, కుటుంబానందం చెప్పదగిన వారం.

ధనుస్సు : క్రీడారంగంలో చాలామందికి నూతన నావకాశాలు లభింపగలవు వ్యాపారంలో అధిక లాభం సంపాదించే మార్గమున్నది. అయినా, విలు వస్తువులు పోయే మార్గమున్నది. జాగ్రత్త! సాహిత్య కళారంగాలలో అవకాశాలుండగలవు. స్త్రీలకు : ముఖ్య బంధువుల సహాయం, ధాన్య సేకరణకు అవ కాశం గలదు ఆరోగ్యలోపం లేని వారం. కృషి చేయండి.

మకరం : పత్రికా ప్రకటనకర్తలకు, గ్రంధ రచనా విధానంలో చేయి తిరిగిన వారికి, రాజకీ యంగా అధికారం ఆశించేవారికి నూతన వ్యాపార ప్రయత్నాలకు దిగే వారికి అనుకూలత గల వారం. బంధువులు అనుకోకుండా ఇల్లు చేర గలరు. అధిక వ్యయాన్ని సూచించే వారం. స్త్రీలకు: గౌరవ పదవులు లభించడం, సభా కార్యక్రమంలో పాల్గొనటం సంభవం.

కుంభం: వ్యాపార లోపంలేదు. అందవలసిన డబ్బు సమయానికి అందటం, అవసరాలు తీరటం గమనిస్తారు. భారీ వ్యాపారంలో, జాయింటు వ్యాపా రంలో సుముఖత కనిపిస్తుంది. క్రీడావనిలో సదవకాశాలు లభింపనున్నవి. స్త్రీలకు: కించిత్తు ధనలాభం, అధికారుల వలన జరగదగిన పనులు నెరవేరటం సంభవం.

మీనం : ఎంత ప్రయత్నించినా ఇటీవల జరగని పనులు, ఎంత ధైర్యంతో కార్యరంగానికి దిగినా సుగమంగా జరగనివ్యవహారాలు ఈ వారంలో అనుకూలంగా, ఆనందదాయకంగా, ఆర్థికంగా, లాభ దాయకంగా పరిణమించగలవు. ఆశించిన వార్తలు ఉత్తరాల మూలాన గ్రహించనున్నారు. స్త్రీలకు : విలువగల వస్తు సేకరణ, మంచి ఆదాయం, కార్యాను కూలత చెప్పదగిన వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

హస్తప్రయోగము - నపుంసకత్వము

## సెక్సు హాస్పటల్



దురభ్యాసాలకు లోనై దాంపత్య సౌఖ్యం అనుభవించ లేనివారు వెంటనే సంప్రతించండి!

డా॥ A. పూర్ణచంద్రరావు

(సెక్సు స్పెషలిస్టు) N.D.F.N.F.U(CEYLON) R.A.M.P

గవర్నరుపేట, మ్యూజియం రోడ్, విజయవాడ-2 (A.P.)

మొఖవ్యాధులకు ప్రత్యేక చికిత్స

Phone No **63753**



## యూకాన్

పేలు చుండ్రు నివారిణి.

అన్ని షాపులలో దొరకును

మాన్‌ఫార్మా విజయవాడ-2 VTS



ప్రఖ్యాత రచయిత్రి

## మాలతీ చందూర్

రచనలు...

"నువ్వు ఐ ఏ యస్ చదివి కలెక్టరవుతావనుకొన్నాను" అన్నాడు రాముడు.

"కలెక్టరు కంటే పెద్ద ఉద్యోగాలు లేవా?" ఛాలెంజి చేస్తున్నట్టు అడిగింది, స్టేట్ బ్యాంకులో సీనియర్ ఆఫీసరుగా ప్రమోట్ కాబోతున్న మహి.

## రాగం-అనురాగం

వెల: రూ 12-50

ఏ పత్రికలోనూ సీరియల్ కాకుండా నేరుగా వెలువడిన నవల!

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన నవలలు...







జంట నగరాలు రూ. 11-00

ప్రణయ సౌరభం రూ. 11-00





గొప్ప వనిత రూ. 11-00

మంకెన పువ్వు రూ. 11-00



డీలక్స్ పబ్లికేషన్స్

ఏలూరు రోడ్, విజయవాడ-2


## అవీ...ఇవీ...అన్నీ

### శ్రీ వెంకటేశ్వర కీర్తనలు

రచన : శ్రీ వోరుగంటి రామకృష్ణప్రసాద్. 30 పేజిలు. వెల రూపాయి. ప్రతులకు శ్రీ సాయి భక్తి ప్రచారసమితి, శ్రీ సాయి సువర్చలసదన్, రామలింగేశ్వరపేట, విజయవాడ—3.

### మానవారణ్యం

కవితా సంపుటి. రచన: శ్రీ మంతెన సూర్య నారాయణరాజు, 52 పేజీలు, వెల రు. 4.50. ప్రతులకు : శ్రీమతిఎం వరలక్ష్మి, కేరాఫ్ మాస్టర్ కుటీర్ కొంకపల్లి, అమలాపురం—533203. లేదా ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్ హైదరాబాద్.

### తెలుగులమ్మ పదాలు

రచన: శ్రీ "అమర్‌జీ" (జి ఆర్. జె. రెడ్డి) 40 పేజిలు. వెల రు. 2 00 లు. ప్రతులకు : రచయిత పేర చినకొదమగుండ్ల, వయా కారెంపూడి — 522614, గురజాల తాలూకా, గుంటూరు జిల్లా.



వర్ధమాన గాయిని కుమారి శారద ఈమె మధ్యనే విడుదలైన హెచ్. ఎం వి. గ్రామ ఫోన్ రికార్డు 'ఆరాధన'లో దేవుడు పాటలలో పాల్గొని శ్రోతలనుంచి మంచి పేరుతెచ్చుకున్నారు. ఆంధ్రా యూనివర్శిటీ మ్యూజిక్ కాలేజీలో సంగీతం పట్టభద్రురాలైన ఈమె 1972 లోనే బాల గాయినిగా ప్రధాని ఎదుట్నా, 1978 లో రాష్ట్రపతి ఎదుట జరిగిన కార్యక్రమాలలో పాల్గొన్నది. కొన్ని సినిమాలలో కూడా పాడిన శారద విశాఖపట్నం రేడియోలో లలితగానం తరచు చేస్తుంటుంది.


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# చతుర
# నవలా ప్రపంచం...

ప్రేమతో పెంచుకుంటున్న మీ చిన్న లైబ్రరీ కోసం మీరు మక్కువతో సేకరించుకున్న నవలలు ఎన్ని.? ఎన్నో లేవా...! చుక్కల్ని తాకే ధరల్లో ఎన్నని కొనగలం అని మీ పఠనాసక్తిని అణచి పెట్టుకుంటున్నారా...?

ఆ ఇబ్బందిని సునాయాసంగా అధిగమింపజేస్తుంది 'చతుర'. నెల నెలా ఒక సమగ్ర నవలను సర్వాంగ సుందరంగా అలంకరించి అతి తక్కువ ధరకు అందజేసే ఏకైక నవలా వేదిక చతుర .. ఇప్పటి వరకూ వెలువడిన **38** సంచికలలోనూ **38** నవలలను తెలుగు పాఠకులకు సమర్పించింది చతుర. కథా వస్తువులో వైవిధ్యం, రచనా సంవిధానంలో నిండుదనం, రూపురేఖలలో నూతనత్వం 'చతుర' ప్రత్యేకతలు.

**132** పేజీల పత్రికలో నెల నెలా ఒక సమగ్ర నవలతో పాటు ఎన్నో మినీ కతలు, అద్భుతమైన చతుర ప్రపంచ విచిత్రాలు కూడా అందజేస్తోంది 'చతుర'. తెలుగు నవలలతోపాటు మధ్య మధ్య మణిపూసల్లాంటి ఇతర భాషల నవలల్ని కూడా అందజేస్తున్న ఏకైక మాస పత్రిక చతుర. అల్ప కాలంలోనే తెలుగు పాఠకులను ఆకట్టుకున్న నవ నవలా వేదిక 'చతుర'.






132 పేజీలు **చతుర** రెండు రూపాయలే

ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే నవలా తరంగం 'చతుర'

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పువ్వు వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియూ కలుగజేయదు

ఐటెక్స్ 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం




అరవింద్ లాబరేటరీస్
మద్రాసు 600033

Imageads AL-1292 Tel